ADAB AUR NAZARIYAH
(Telugu)

# సాహిత్యం 'వాద' వివాదాలు

రచన

ఎస్.ఎమ్. మలిక్

## అవతారిక

ఆమధ్య తెలుగు సాహితీ చర్చల్లో వాదనల హోరు మళ్ళీ మొదలయింది. ముఖ్యంగా 'ముస్లిమ్ వాదం' అన్న ఘోష ఒక ప్రక్కన మొదలయినప్పుడు ఇది మరీ తీవ్రంగా, ఉధృతంగా వినిపించసాగింది. ముస్లిం వాదంలో 'కమ్యూనల్' కంపు వస్తోందని కొందరంటే, అదేమీకాదు దానికి సాత్వికమయిన తాత్విక భూమిక కూడా ఉందని వాదించినవారూ ఉన్నారు. కావలసింది ముస్లిమ్‌వాదం కాదు, ఇస్లామ్ వాదం అని మరికొందరు సిద్ధాంత కర్తలు ఘోషించారు. ముస్లిం వాదం, ఇస్లామ్ వాదాల వాదోపవాదాలలో కేవలం 'ముస్లిములు', 'ఇస్లామిస్టులు' మాత్రమేకాక అనేక ఇతర వాదాలలో సిద్ధాంతకర్తలుగా వ్యవహరించిన మరీ పెద్దలు కూడా కొందరు కాలిడి తమ వంతు పాత్ర నిర్వహిస్తున్నారు. ఈ 'చీలిక'ను వీలయినంత బలంగా, దృఢంగా, ఎడంగా, పకడ్బందీగా తీసుకురావాలనీ కొందరు నడుంబిగించుకున్నట్లు కూడా స్పష్టంగా కానవస్తోంది.

ఇంత రభస జరుగుతున్నప్పటికీ ఉలకవూ పలకవేమిటీ అని కొందరు మిత్రులు చొరవతో నన్ను కదిలించ ప్రయత్నించారు. నేనేమయినా కవినా, కథకుణ్ణా, సాహితీకారుణ్ణా, విమర్శకుణ్ణా- నేనేమని ఇందులో జోక్యం చేసుకోనూ? అంటూ దాటవేసే ప్రయత్నం చేశాను. నా స్థాయి, స్థానం, నా పరిధులు, పరిమితులు ఎరిగిన వాణ్ణే కాబట్టి ఈ గందరగోళంలో పాదం మోపరాదనే నిర్ణయించుకున్నాను. కొందరు మరీ ఆత్మీయులు, అనుభవ రాహిత్యం వల్ల నీవు గాయపడినా సరే రణరంగంలోకి దిగవలసిందేనని ఈడ్చారు. కదనరంగంలోకి వచ్చి కదలకపోతే పరిస్థితులే కుదించి వేసి బందీగా

నిర్బంధిస్తాయేమో అన్న అనుమానం పీడించసాగింది. పైగా కొందరు మిత్రులు, ఈ వాదాలెలా ఉన్నా ఇదే సందర్భాన్ని పురస్కరించుకుని 'సాహిత్యం-ఇస్లామ్' అన్న అంశాన్నయినా సరే పరామర్శించవచ్చుకదా అని ఉచిత సలహాలతో సత్కరించారు. ఇక చేసేది లేక కలం, కాగితం, కబుర్లతో కదంతొక్కాలని నిర్ణయించుకున్నాను. ఇదీ ఈ చిరు విన్నపాలకు పూర్వరంగం. ఇది చెప్పకపోతే నన్ను నేనే అన్యాయం చేసుకున్న వాణ్ణవుతానేమోనని చెప్పుకుంటున్నాను.

ఈ చిరుపుస్తకం, సిద్ధాంత పుస్తకమూ కాదు, పరిశోధనా గ్రంథమూ కాదు, కేవలం అవసరం కొద్దీ వ్రాసిన రెండు వ్యాసాల సమాహారం మాత్రమే. ఇది 'గీటురాయి' వారపత్రికలో ( 21-4-2006 నుండి 12-5-2006 వరకు, తరువాత 3-11-2006 నుండి 17-11-2006 వరకు ) "సాహిత్యం- 'వాద' వివాదాలు" అనీ, "ఇస్లామ్- సాహిత్యం" అనీ రెండు శీర్షికలతో వ్రాసిన వ్యాసపరంపరకు పుస్తకరూపం.

ఈ వ్యాసాలు ఒక్కసారే కూర్చుని వ్రాసినవి కావు. అవకాశం దొరికి నప్పుడల్లా వ్రాయడానికి ప్రయత్నించిన కృషి. అందువల్ల అక్కడక్కడ పునరుక్తి దోషం కానరావచ్చు.

లోగడ తిరుపతిలోని పద్మావతి మహిళా విశ్వవిద్యాలయంవారు తెలుగు సాహిత్యంలో ఇస్లామ్‌వాదం, ముస్లిమ్‌వాదాలను గురించి ఓ సర్వే జరిపారు. ఆ సందర్భంలో 32 ప్రశ్నలతో కూడిన ఓ ప్రశ్నావళిని వారు పంపారు. దానికి ఇచ్చిన సమాధానాలు కొన్నింటిని మాత్రమే ఎన్నుకొని ఈ రెండు వ్యాసాల చివరన విషయానుకూలత కారణంగా జతపరచడం జరిగింది.

**- ఎస్.ఎమ్. మలిక్**

# ప్రతిస్పందన

ఇస్లాం మతంలోను, ఖుర్‌ఆన్‌లోను, ముహమ్మద్ ప్రవక్త బోధనల్లోను పరిపూర్ణ విశ్వాసమున్న ఎస్.ఎం. మలిక్‌గారు తాను రచించిన 'సాహిత్యం 'వాద' వివాదాలు' పుస్తకానికి నన్ను ముందుబాట రాయమని కోరడం నాకు ఆశ్చర్యం కలిగించింది. దేవీప్రియ అయినా ఆయనకు చెప్పి ఉండవలసింది- నేను కరడుగట్టిన వర్గపక్షపాతినని. సాహిత్యానికి వర్గ దృక్పథం ఉంటుందని ప్రగాఢంగా విశ్వసించడమే కాదు వాదిస్తానని. నాకు మార్క్సిజంలో, కమ్యూనిస్టు మానిఫెస్టోలో, మార్క్స్ ఎంగెల్స్‌తో ఆరంభించి మార్క్సిజాన్ని సృజనాత్మకంగా అన్వయించిన వారిలో శాస్త్రీయమైన విశ్వాసముందని నేననుకుంటున్నాను.

ఇద్దరమూ మనుషులుగా, మానవత్వంపై అపారమైన గౌరవము, నమ్మకము ఉంచి మానవీయ విలువలను ఆవిష్కరించే సాహిత్యం కోసం పరితపించే వాళ్లం గనుక అడిగి ఉంటారు. ఇద్దరికీ మతం కన్నా, మార్క్సిజం కన్నా జీవితం పట్ల ప్రేమ ఉంది. ఆ జీవితాన్ని సార్థకం చేసుకోవడానికి, సుసంపన్నం చేసుకోవడానికి సాధనాలుగా బహుశా ఆయనకు ఇస్లాం పరికరమో, ఆలంబనో అయితే లేదా జీవన దృక్పథమైతే, నాకు మార్క్సిజం అయింది. ఆయన ఇస్లాం ఒక మతం కాదు ఒక జీవన విధానం అంటారు. మార్క్సిజం కేవలం సిద్ధాంతం కాదు తాత్విక దృక్పథమని నేను అనవచ్చు. ఇద్దరమూ మతమో, మార్క్సిజమో జీవితానికి పర్యాయపదాలని మాత్రం భావించం. మనుషుల్ని జీవితం కలుపుతుంది. సుఖదుఃఖాల జీవితం, రాగద్వేషాల జీవితం, మంచీచెడు ఘర్షణల జీవితం, రక్త, మాంసాల భావోద్వేగాల జీవితం. ఈ జీవితంలోని కవితాన్వయం వంటి నిర్హేతుకతయే ఏదో సాహిత్యాన్ని స్పృశిస్తుంది.

'.... సాహిత్యం జీవితంలో అంతర్భాగమన్నది వాస్తవం. అయితే జీవితం నిర్మాణ ప్రధానమన్నదీ యదార్థమే. జీవితంలో విచ్ఛిన్నానికి తావేలేదు. నిజానికి విచ్ఛిన్నంతో పోరాటం, 'నిర్మాణా'నికి ఆహ్వానమే జీవన సంఘర్షణకు సూత్రప్రాయమైన నిర్వచనం. జీవితాన్ని సంఘర్షణగా పరిగణిస్తే, మంచీచెడూ, నిర్మాణం విచ్ఛిన్నం, ప్రయోజనకరం, హానికరం, సత్యం, అసత్యం, న్యాయం అన్యాయం, ధర్మం అధర్మం– ఈ రెంటి పోరాటంగానే జీవితాన్ని నిర్వచించ వచ్చు. ఈ పోరాటంలో సృజనాత్మకశక్తులు నిత్యం నిర్మాణాత్మక శక్తులకే బాసటగా నిలవాలన్నది స్థూల దృష్టితో చూసినా సహజంగా, సమంజసంగా అగుపడే వాస్తవం. ఆ విధంగా సాహిత్యం మంచికి పక్షపాతి, నిర్మాణ పక్షపాతి, ప్రయోజన పక్షపాతి, సత్యపక్షపాతి, ధర్మపక్షపాతి, నిజాయితీ పక్షపాతి...'

ఈ ప్రతిపాదనను అంగీకరించడానికి ఏ వాదానికయినా అభ్యంతరం ఏముంటుంది? ఆయన వలె నాబోటి వాడు ధర్మం అనే మాట వాడకపోవచ్చు. ధర్మం అనే మాటకు హిందూ సమాజంలో చిరకాలంగా ఆస్తితో ముడిపడిన, రాజ్యంతో ముడిపడిన సంబంధం ఉండడంతో. లోకరీతిలో వాడేట్లయితే అది వేరే సంగతి. అలవాటు లేక, ఆ మాట వాడడంలో ఆయన ఏం ఉద్దేశిస్తున్నారో తెలియక 'సకల సకారాత్మ లక్షణాలకు పక్షపాతి' అనే మాటవాడకపోవచ్చు.

ఈ పుస్తకంలో రెండు వ్యాసాలు, ఒక ఇంటర్వ్యూ ఉంది! 1. సాహిత్యం 'వాద వివాదాలు'. 2. ఇస్లామ్ సాహిత్యం. 3. పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం ప్రశ్నావళి–సమాధానాలు.

ఈ మూడింటిలో సర్వవ్యాప్తమయిన ఒక దృక్పథంతో నాకు ఏకీభావం ఉంది. అది సామ్రాజ్యవాద వ్యతిరేకత. దానిని ఆయన పాశ్చాత్య దృక్పథం అనొచ్చు. నేను పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెంది సామ్రాజ్యవాద దశకు చేరుకొని మరణశయ్యపై ఉన్నందువల్ల ఆగిపోయిన నిర్మాణం, సృజనాత్మకతగా భావించవచ్చు. ఇద్దరికీ పెట్టుబడి స్వభావమైన శ్రమతో దోపిడీ, పరాయీకరణ,

మార్కెటు విస్తరణల పట్ల, ఫలితంగా ఏర్పడే మానవ సంబంధాల విచ్ఛిన్నతల పట్ల వ్యగ్రత ఉన్నది. ఇదంతా పాశ్చాత్య ప్రభావం అని ఆయనకు అనిపిస్తుంది. సాహిత్యంలో వాదాలు అందుకే దోహదం చేస్తాయని అనిపించవచ్చు. మాగ్జింగోర్కీ 'విచ్ఛిన్నమవుతున్న వ్యక్తిత్వం'లో మార్కెటువల్ల పరాయీకరింప బడుతున్నా ఈ మానవీయ విలువల గురించే ఎస్.ఎమ్. మలిక్‌గారి కన్నా ఎంతో ముందుగ ఆవేదనపడినారు.

'శ్రామికుని చెమట ఆరకమునుపే అతని వేతనాన్ని చెల్లించండి' అని ఖుర్‌ఆన్ చెప్తే, శ్రామికుని రక్తం చెమటయి, చెమట సరుకయి, సరుకు మార్కెట్లో పెట్టుబడికి లాభాలు సృష్టిస్తుంటే శ్రమకు అర్థాకలి తీర్చుకోవడానికి, మళ్లీ శ్రామికుణ్ని ఉత్పత్తి చేసే పునరుత్పత్తి విధానానికి సరిపడ మాత్రమే వేతనం ఇస్తున్నారు. దీనినే దోపిడీ అంటారు అని మార్క్సిజం చెప్తుంది.

అన్యాయాన్ని అక్రమాన్ని ఆపాలన్నా, దీన్ని అసహ్యించుకోవాలన్నా ఏది న్యాయమో ఏది అన్యాయమో, ఏది క్రమమో, ఏది అక్రమమో, ఏది సహ్యమో, ఏది అసహ్యమో వివేచన, విచక్షణ కావాలి కదా. వర్గ సమాజంలో ఈ న్యాయాన్యాయవివక్ష వర్గ దృక్పథంతో ఏర్పడుతుందంటాడు మార్క్స్. 'పులి చంపిన లేడినెత్తురు' పులులకు, జింకలకు ఒకే అనుభూతి కలిగించరు. బహుశా పులికి ఆనందహేల అవుతుంది. జింకలకు ప్రాణాంతకమవుతుంది.

ఇవ్వాళ ప్రపంచ వ్యాప్తంగానే 'కేంద్రాన్ని మార్చాలి' (మూవింగ్‌ది సెంటర్ – గూగేవాధియాంగో) అనే ఒక ప్రబలమైన ఉద్యమం అటు సమాజా ల్లోనూ, ఇటు సాహిత్యంలోనూ వ్యాపిస్తున్నది.

'నీ సముదాయాన్ని ప్రాశ్చాత్య జాతుల ఆధారంగా ఊహించుకోకు. హాషిమా ప్రవక్త (ముహమ్మద్) ఏర్పరచిన సముదాయం దాని నిర్మాణం రీత్యా ప్రత్యేకమయింది.'

అన్న ప్రాగ్దేశ మహాకవి 'ఇక్బాల్' సందేశాన్ని మలిక్‌గారు ప్రమాణంగ చూపుతున్నారు.

ఏర్పడిన ఒక సముదాయం నిర్మాణంలోకి ప్రవేశిస్తుంది. మానవ సముదాయం వృధాగా, అన్వసరంగా సృజన కాలేదనేది నిజమే కాని దానినెవరూ సృజించలేరు. వానరుడు నరుడుగా మారిన పరిణామక్రమంలో శ్రమ పాత్ర ఉన్నది. ఈ శ్రమ ఉత్పత్తికే కాకుండా ఊహలకు, భావనలకు, ఉద్వేగాలకు కూడ కారణమై సాహిత్యము, కళలు సృజింపబడుతున్నాయి.

ఒక దృక్పథం, ఒక సిద్ధాంతం, ఒక తాత్విక వివేచన- జీవిత విధానాన్ని అర్థం చేసుకోవడానికి, జీవితాన్ని మెరుగుపరుచుకోవడానికి దోహదం చేసినట్లు గానే, జీవిత విధానంగా భావించే మతం కూడ అందుకే అని మలిక్ గారు విశ్వసించినట్లుగానే వాదాలు కూడ ఆ బలమైన విశ్వాసాలతోనే బయల్దేరి నాయి.

'సాహితీ ఉద్యమంగా సాగుతున్న, అభ్యుదయ సోదరులు సైతం' మతం అంటే మత్తు మందు' అని నిర్వచించి మస్కిష్కాలను కలుషితం చేసివేశారు. ఏ మత భావనను మత్తుమందని మార్క్స్ పేర్కొన్నాడో తెలుసుకోవాలన్న కనీస జిజ్ఞాసనన్నా చూపలేదు మన 'అభ్యుదయ' సోదరులు. (పే.41)

అంటూ మలిక్‌గారు 'మత భావన పాశ్చాత్యులు అందజేసిందని, వారి చుట్టుపట్ల ఉన్న వాతావరణం నుంచి ఉద్భవించిందని, వారు పరిశీలించిన, అనుభవించిన మతం అలాంటిదేనని, శతాబ్దాల తరబడి తమపై రాజ్యమేలిన మత భావన అది'- అని అటువంటి మతం గురించి మార్క్స్ 'మత్తు మందు' అన్నాడని సూచించడానికి ప్రయత్నం చేస్తున్నారు గనుక మతం గురించి మార్క్స్ ఏం చెప్పాడు, మార్క్సిస్టుల వైఖరి ఏమిటో తెలుసుకోవాలి.

'మతం మత్తు మందు. మనిషిగాయాలను మరచిపోయే మలాము' అన్నాడు మార్క్స్. ఆదిమ సమాజం నుంచి పరివర్తన దశతో మనిషి ఎదుర్కొంటున్న ఎన్నో సమస్యలకు, ప్రశ్నలకు, ముఖ్యంగా ప్రకృతి నుంచి వచ్చిన సవాళ్లకు సమాధానం దొరకని మనిషికి ఆస్తి సంచికమయ్యే క్రమంలో

శ్రమ, జ్ఞాన విభజనల ఫలకంగా సమాధానాలు చెప్పే వర్గమొకటి తయారైంది. అది పాశ్చాత్య దేశాల్లో చర్చి మాత్రమే కాదు, మన దేశంలో పురోహిత వర్గం కూడ. ఇంగ్లాండులో నాలుగు వందల ఏళ్ల క్రితం పార్లమెంటు ఏర్పడేదాక మలిక్‌గారు చెప్పినట్లు మతమే రాజ్యం చేసిన మాట నిజమేనది ఏ మతం ఎక్కడ రాజ్యం చేయలేదని? బ్రాహ్మణ క్షత్రియ వర్ణాలు వేల సంవత్సరాలు మన దేశంలో, ఇవ్వాల్టికీ సౌదీ అరేబియా వంటి చోట మత రాజ్యాలు ఉండనే ఉన్నాయి. సౌదీ, పాకిస్తాన్, బంగ్లాదేశ్‌లలో ఉన్నవి ఖుర్‌ఆన్ అనుగుణంగా నడిచే ఇస్లాం రాజ్యాలు కావు. ఆ అర్థంలో ఇస్లాం రాజ్యాలు ఎక్కడా లేవని నిజాయితీగల ఇస్లామీయులు అనవచ్చు. బైబిల్ ప్రకారం ఎన్నడూ పాశ్చాత్య రాజ్యాలు నడుచుకోలేదని నిజమైన జీసస్ అనుచరులు అనవచ్చు. వైదిక ధర్మం ప్రకారం ఏ హిందూరాజు పాలించలేదని వివేకానందునికి అనిపించ వచ్చు. మతం అధికారమైనాక, ముఖ్యంగా రాజ్యస్వభావంలో భాగమయ్యాక అది రాజ్యస్వభావమైన అణచివేత, ఆధిపత్య భావాలనే సంతరించుకుంటుంది. వ్యక్తిగత, ప్రైవేటు విశ్వాసంగా మార్క్సిస్టులు మతాన్ని ఎప్పుడూ వ్యతిరేకించ లేదు. ప్రపంచాన్ని, మనిషిని, సమాజాన్ని, ప్రకృతిని మనం నూరుశాతం కూడ అర్థం చేసుకోని మాట నిజమే కావచ్చు. ఇవన్నీ అర్థం చేసుకోగల మార్గం, పరికరాలు మార్క్సిజంలో లభించాయి కనుక శాస్త్రీయంగా అన్నిటికీ సమాధానాలు చలన సూత్రాల్లో లభిస్తాయని, అందుకని మనిషి మత విశ్వాసాల మీద ఆధారపడ నక్కర్లేదని మార్క్సిస్టులు విశ్లేషిస్తారు. వెంటనే వ్యక్తిగత, ప్రైవేటు మత విశ్వాసాలను గౌరవిస్తారు. అడ్డగించరు.

మార్క్సిస్టులు చెప్పేదల్లా అది ప్రభుత్వ ఆచరణ కాకూడదు. లౌకికవాదం అంటే జనాభా ప్రాతిపదికగా మత విశ్వాసాలను ప్రభుత్వం ఆచరించడం కాకూడదు. ప్రభుత్వాలు మతాతీతంగ ఉండాలి. ప్రజల మత విశ్వాసాలు వారి ఇష్టం. వారి వారి మత విశ్వాసాలు ఆచరించడానికి వారికి పూర్తి స్వేచ్ఛ ఉండాలి.

మార్క్స్ సామ్యవాద ప్రభుత్వం ఏర్పడగానే మతాన్ని రద్దు చేయాలని గానీ, మతం పోతుందని కానీ భావించలేదు. ఈ వ్యవస్థకు సంబంధించిన వృక్షానికి ఆకులవంటిది మత విశ్వాసాలు. కనుక వర్గరహిత సమాజం ఏర్పడినప్పుడు మాత్రమే రాజ్యం అదృశ్యమైనట్లుగానే మత విశ్వాసాలనే ఆకులు ఎండిపోయి వాటంతటవి రాలిపోతాయన్నాడు.

చరిత్ర క్రమంలో మత విశ్వాసాలను అర్థం చేసుకోవడంలో కూడ రాజకీయార్థిక నేపథ్యం నుంచి మతం పట్ల మార్క్సిస్టులు తమ వైఖరిని సాపేక్షంగా ఏర్పరచుకుంటారు. నాస్తికులవలె, హేతువాదులవలె మార్క్సిస్టులు ఉపరితలమైన మతం మీద యుద్ధం చేయడానికి బయల్దేరిన వాళ్లు కాదు. వాళ్లు వ్యవస్థ మీద యుద్ధం చేసి సమూల మార్పు తేవడానికి బయల్దేరిన వాళ్లు. స్థూలంగా రాజ్యంలో మెజారిటీ మతం ఆధిపత్య అంశం అయిన చోట మలిక్‌గారు తప్పుపట్టిన మైనారిటీల పట్ల అనుకూల వైఖరి ప్రదర్శిస్తారు. ఈ దేశంలో ముఖ్యంగా 1984 స్వర్ణదేవాలయంపై దాడి, సిక్కుల ఊచకోత కాలం నుంచి 1992 బాబ్రీ మసీదు విధ్వంసం, 2001 గుజరాత్ మారణకాండ తర్వాత రాజ్యం పూర్తిగా హిందూ రాజ్యంగా మారింది గనుక మైనారిటీ ముస్లిం మతాన్ని దళితులు, ఆదివాసులు, మహిళలతోపాటు పీడనకు గురవుతున్న సముదాయంగా మార్క్సిస్టులు భావిస్తారు. అందుకే అభ్యుదయ, విప్లవ సాహిత్యవాదాలకు ముస్లింవాదం పట్ల అనుకూల వైఖరి.

ఈ అంశం ఈ దేశానికే పరిమితం కాకుండా మరోచోట వివరించినట్లు ప్రపంచస్థాయిలో ముఖ్యంగా రెండో ప్రపంచ యుద్ధకాలం నుంచి సామ్రాజ్యవాదంకు ఇస్లాం శత్రువుగా కనిపిస్తున్నందున ఇస్లాంవాదాన్ని ఇతర మతవాదాలతో కలిపి కాకుండా రాజకీయార్థిక నేపథ్యం నుంచి అర్థం చేసుకోవాలని ప్రయత్నిస్తారు. అట్లని ఎక్కడైనా ఉన్మాదాన్ని, బీభత్సాన్ని, హింసను, ద్వేషాన్ని ఉపేక్షిస్తారని కాదు- కానీ ఈ అన్ని మానసిక స్థితులకు,

మనోభావాలకు ఆధిపత్యం రాజ్యాధికార అంశంలో చేరిన మెజారిటీ మత భావనయే బాధ్యత వహించాల్సి ఉంటుందని భావిస్తారు, ఏమైనా మార్క్సిస్టుల యుద్ధం మత్తుమందు మీద కాదు, ఆ మత్తుమందు ములాంగ మారే స్థితికి ఈనాటికీ దోహదం చేస్తున్న రాజకీయార్థిక పునాది మీద- దానిని కూకటి వేళ్లతో పెకలించడానికి.

ఈ పుస్తకం ప్రధానంగా ముస్లింవాద-ఇస్లాంవాద సాహిత్యాన్ని విశ్లేషించడానికి రాసిందికాబట్టి వాదాల గురించిన మలిక్‌గారి అభిప్రాయాలు చర్చలోకి రాక తప్పదు.

'తెలుగు నేలపై వెలసిన తొలి సాహితీవాదం 'అభ్యుదయవాదం.' కమ్యూనిస్టు సోదరుల ఈ అభ్యుదయవాదానికి ప్రాతిపదిక వర్గపోరాటం. అందులో నుంచి పుట్టినదే 'వర్గవాదం.' వర్గవాదానికి మూలనినాదం 'తాడిత పీడిత' జనులగొంతుక వినిపించడం.

ఇందులో బేసబబుగానీ తప్పుపట్టాల్సిందిగానీ ఏముంది? 'అభ్యుదయం' సమాజం ముందుకు వెళ్లడాన్ని ఆశిస్తుంది. 'విప్లవం' సమూల మార్పును ఆశిస్తుంది. ఏ మానవ విలువల కొరకైతే, విశ్వసనీయమైన సత్యం, సౌందర్యాల కోసమయితే సాహిత్యంలో మలిక్‌గారు అన్వేషిస్తున్నారో అవి సాధ్యమయ్యే ఒక వర్గరహిత సమాజంలోకి, ఆయనే ఆకాంక్షిస్తూన్న మతం, కులం ప్రాతిపదిక కాకుండా విలువల ఆధారంగా గౌరవింపబడే మానవ సంబంధాల కోసం, వాటి ఆవిష్కరణ కోసమే వర్గపోరాటం ప్రాతిపదిక కావల్సివచ్చింది.

ఆ గొంతుకలో (తాడిత, పీడిత జనుల గొంతుక వినిపిస్తానన్న వర్గ పోరాట నాద గొంతుకలో) తమ కంఠం సరిగ్గా వినిపించకపోయేసరికి, వినిపించడం లేదని వాళ్లు భావించినందువల్లనే అనుకుందాం- దళితవాదం, స్త్రీవాదం వేరుగా వినిపించసాగాయి. అందులో అంతర్భాగం అనుకుంటూనే 'మైనారిటీ' వాదం ప్రత్యేక కంఠంగా ఖంగు మనసాగింది. మైనారిటీ అంటే

ఏ మైనారిటీ అన్న ప్రశ్న ఇంకా పూర్తిగ తలెత్తక ముందే 'ముస్లిం' వాదం అందులోనుంచి కొత్తరాగాన్ని అందుకుంది.' (పేజీ 12)

'ఈ చీలికలు, పేలికలు అన్నీ ఆ మూలమంత్రమయినా' వర్గ పోరాటంలో నుంచి ఉద్భవించినవే' అని వ్యతిరేక భావంతో మలిక్‌గారు వ్యాఖ్యానించినా వర్గ పోరాటాన్ని, తద్వారా ఆవిష్కరించుకోగలిగిన మానవీయ సమాజాన్ని బలపరచే వాదాలు 'తాడిత, పీడితులనుండి నిజాయితీగా వచ్చినప్పుడు తప్పకుండా ఆహ్వానించదగినవే.

ఈ మూలభావనతో మలిక్‌గారికి ఏకీభావం ఉంది.

'పీడితులు, బాధితులు విభిన్న వర్గాలు కలిసి ఉమ్మడి పోరాటం సాగించడం అన్నది అన్ని విధాలా శ్రేయస్కరమైన విషయమే. ప్రజాస్వామిక వ్యవస్థలో ప్రజాబలం ఎంతగా వీలయితే అంతగా సమీకరించుకుంటేనే కోర్కెల సాధన అతిసులువవుతుందన్నదీ వాస్తవమే. 'పోరాటా'నికి అది సకల విధాల శోభించే అంశమే. అయితే దాని ఆధారంగా ఏ సముదాయమైనా, ఏ వర్గమయినా తన ప్రత్యేకతను, తన గుర్తింపును మిగతా వారితో విలీనం చేసుకోవడమో, లేదా దాన్ని లుప్తపరచుకోవడమో అవసరమా? ఏమో అది ఆత్మహత్యా సదృశమని కొందరి అభిప్రాయం' అని అంటూనే..

'ఈ పోరాటానికి అనుగుణంగా మరో దిశలో ప్రజాచైతన్యాన్ని మలచడానికి ప్రత్యేక సాహితీ ఉద్యమం కూడ అవసరమని భావించడమూ బాగానే' ఉంది అని అంటూనే...

'ముస్లింలు తాము కేవలం ఒక బాధిత వర్గంగా, ఒక పీడిత సముదాయంగా, ఒక ఉపేక్షిత జాతిగా మాత్రమే తమ ఉనికిని నిర్వచించు కోవడం భావ్యమా?' అని ప్రశ్నిస్తారు.

'ఈ బాధలు, ఈ అడ్డంకులు, ఈ అవాంతరాలు, ఈ అంతరాలు భారత ముస్లింలకూ, భారత దేశంలోని ఇతర వర్గాలకు మధ్యన ఉన్నమాట వాస్తవమే కావచ్చు' అని అంగీకరిస్తూనే...

'వారు ఎన్నడూ తమ హక్కుల కోసం పోరాడే, తమ స్వార్థం కోసం కృషిచేసే వర్గంగా (వెయ్యిన్నరేళ్ల చరిత్ర) తమ చరిత్ర మొత్తాన ఎక్కడా కానరారు. నేడు 'అటువంటి దుర్దశ వారికి దాపురించిందంటే కారణం వెదకవలసి ఉంటుంది.' (పే.31)

'ముస్లింలకు ఒక జాతిగా, ఒక సముదాయంగా, ఒక ప్రత్యేక జీవన పరమార్థంతో వెలసిన సామూహిక వ్యవస్థగా గుర్తింపు ఉంది.'

మరి ఆ గుర్తింపు చరిత్ర క్రమంలో కుట్రపూరితంగా రద్దు చేస్తున్న దెవరు? ఎందుకు? అందులో ఎవరి స్వార్థప్రయోజనాలు ఉన్నాయి అనే అంశాన్ని చారిత్రకంగా విశ్లేషించినప్పుడు బహుశా మనం ముస్లింవాదాన్ని అయినా, ప్రపంచ స్థాయిలో ఇస్లాంవాదాన్నాయినా సానుభూతిగా అర్థం చేసుకోగలం. అది మలిక్ భాషలో పాశ్చాత్య దేశాల కుట్ర.

మరే గత చరిత్రలోకి వెళ్ళకుండా కనీసం గత అరవై ఏళ్ల చరిత్ర చూస్తే ఈ ప్రత్యేక జీవన పరమార్థంతో వెలిసిన ఒక జాతి జీవితంలో, ఒక సముదాయ సంస్కృతిలో పెట్టుబడి తన ప్రయోజనం కోసం జోక్యం చేసుకున్నది పాలస్తీనా గుండెల మీద ఇజ్రాయిల్‌ను ఏర్పాటుచేసి ముస్లిం సామూహిక వ్యవస్థ పాదాల కింద నేలలో ఉన్న చమురు మీద ఆధిపత్యం కోసం ఆ జాతికి నాగరికత లేదన్నది. ఆ మతం వెనుకబడిందన్నది. ఇది రెండు నాగరికతల మధ్యన ఘర్షణ అన్నది. పాలస్తీనా నుంచి అఫ్ఘనిస్తాన్, ఇరాఖ్ ఇరాన్‌ల వరకు అమెరికా సామ్రాజ్యవాద దాడిని అనుభవిస్తున్న ఒక విశ్వమహా సముదాయమైన ముస్లింలు ఆ సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటించ డానికి ఒక ప్రజాబలంగల వాదాన్ని ఆయుధంగా స్వీకరించాలి కదా.

'సాహిత్యం అన్నది కేవలం పోరాట క్షేత్రంలోని ఆయుధమేకాదు. అది దాన్ని ప్రదర్శించే వారి సైద్ధాంతిక, నాగరిక, సాంస్కృతిక, నైతిక విలువల ప్రతీక' అని మలిక్‌గారు స్పష్టంగానే ప్రతిపాదిస్తున్నారు.

ఇంక ఇండియాలో ముస్లింల స్థితిగతుల గురించి ఒక్కమాటలో మలిక్‌గారు పద్మావతి విశ్వవిద్యాలయం వారు వేసిన ప్రశ్నకు జవాబుగా చెప్పారు.

'ఈ ప్రశ్నకు సమాధానం కొరకు నాకన్నా ఎన్నో రెట్లు సాధనా సామగ్రి ఉన్న 'సచర్ కమిటీ' నివేదికలో ముస్లింల పరిస్థితిని గురించి దర్శించవచ్చు' (పే. 53) అని ఒక చోట...

'ముస్లింలు భారతీయులు. భారతదేశంలోని సామాన్య ప్రజలకున్న సమస్యలన్నీ వారికీ ఉన్నాయి. బీదరికం, నిరక్షరాస్యత, నిరుద్యోగం. కొన్ని వర్గాలపట్ల వివక్ష, స్త్రీల పట్ల నిరాదరణ, స్త్రీల మానమర్యాదలకు రక్షణ రాహిత్యం- ఇవన్నీ ఈ దేశంలోని ప్రజలందరికీ ఉన్న సమస్యలే. కాకపోతే అనేక చారిత్రక కారణాల వల్ల, బ్రిటీష్ పాలకులు, భారతదేశంలోని హిందూ ఉగ్రవాద ప్రచారకులు చేసిన దుష్ప్రచారాల వల్ల ఆత్మన్యూతాభావానికి, వ్యక్తిగత స్థాయిలోనూ, సాముదాయికంగానూ లోనయివున్న ముస్లింల విషయంలో ఈ సమస్యలు మరీ ఉధృతంగా, తీవ్రంగా, విస్తారంగా, అధికంగా ఉన్నాయి. అధికంగానే గోచరిస్తాయి కూడ. ఇప్పుడిప్పుడే ముస్లింలు వీటి నుండి బయటపడే కృషి చేస్తున్నారు.' (పే. 61)

తెలుగు సాహిత్యంలో ఇటువంటి కృషికి ఖాదర్ మొహియొద్దీన్ 'పుట్టుమచ్చ' తొలి కృషి అని నేననుకుంటున్నాను. హిందీలో కూడ ఇటువంటిదే 'ముసల్మాన్' అనే ఒక అద్భుతమైన దీర్ఘకవిత వచ్చింది. అయితే మలిక్‌గారు అభిప్రాయపడినట్లు ముస్లింవాద, ఇస్లాంవాద కవిత్వమైనా, సాహిత్యమైనా ఉర్దూలో వచ్చివుంటే అది ముస్లిం సమాజం మీద ఎటువంటి ప్రభావం వేసేదో తెలిసివచ్చేది. తెలుగు మాట్లాడే ముస్లింలు చేసే రచనలు కావడం వల్ల ముస్లిం ప్రధాన స్రవంతిపై ఆ వాదాల ప్రభావాన్ని అంచనా వేయలేక

పోతున్నాం. అయినా అనువాదాల రూపంలో ఏదో ఒక మేరకు అది ముస్లిం సమాజాల్లోకి వెళ్లి ఒక కదలిక తెస్తున్నాయనే నేను భావిస్తున్నాను.

మలిక్‌గారు రెండు వ్యాసాలు ముస్లింవాద సాహిత్యం ఇస్లాంవాద సాహిత్యం గురించి రాసినప్పటికీ ముస్లిం వాదానికి 'పుట్టుమచ్చ'ను ఉదహరించడం మినహాయించి ఆయన చదివిన కవిత్వాన్ని తన వాదానికి లేదా పరిపాలనకు అనుగుణంగా ప్రస్తావించలేదు సాహిత్యంలో వాదాలనే నిరాకరిస్తున్నారు గనుక ముస్లిం వాదాన్ని ఇస్లాంవాద సాహిత్య ప్రతిఫలనాలను కూడ అంతా బూటకమని, రెండూ తప్పుడు వాదాలే అని కొట్టిపారేసారు. అయితే ఈ రెండింటిలో ముస్లింవాదాన్ని విద్వేషాలు రెచ్చగొట్టేదిగా ఉందన్నారు.

అభ్యుదయ సాహిత్య దృక్పథం విషయంలో 'గొరిల్లావార్ ఫేర్' 'అష్టపాది' 'అక్టోపస్'లా వ్యాపించి వంటి విసుర్లు, 'సంస్థాగత వెలుగులో నిగనిగలాడే సుఖమేవేరు' వంటి పరిశీలనలు (స్వయంగా సందేశభవన్‌లో తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్' అనే సంస్థను నిర్వహిస్తూ) మినహాయిస్తే ఎస్.ఎమ్.మలిక్‌గారి భాష చాలా ప్రసన్నంగా, హుందాగా సాగుతుంది. ఆయనకు మానవీయ విలువల పట్ల, జీవితసారం పట్ల ఎనలేని గౌరవం. సాహిత్యకర్తవ్యం పట్ల ఉన్నత మానవుణ్ని ఆవిష్కరించాలన్న అత్యుత్తమ ఆదర్శం షేక్స్పియర్ టాల్‌స్టాయ్, టాగూర్, ఇక్బాల్, వేమన మొదలు మార్క్స్ ఎంగెల్స్ వరకు సాహిత్యవేత్తలాగా ఆయనకున్న అపార గౌరవభావమేననుకుంటాను నన్ను అడగడానికయినా, నేనిది రాయడానికైనా పురికొల్పిన మా అనుబంధం.

**- వరవరరావు**

హైదరాబాద్

28. 8. 07

# మలిక్‌భాయ్ ఇలాగే రాస్తారు!

స్త్రీవాదం, దళితవాదం, మైనారిటీ వాదం, ఇస్లామ్ వాదం, ముస్లిమ్ వాదం వంటి పలు వాదాల గురించిన చర్చోపచర్చలు తెలుగు సాహిత్య వేదికలమీద తగినంత దుమారం రేపి, ఇటీవల కొంత సద్దుమణిగినట్టు కనిపిస్తున్నాయి. వీటిలో అన్నింటికంటే తాజా వివాదం ముస్లిము కవులు, రచయితలలోని ఒక యువవర్గం ప్రతిపాదించిన కొన్ని కొత్త సూత్రీకరణల చుట్టూ తిరుగుతున్నది. దీనిని గురించి కొన్ని పత్రికలలో జరిగిన చర్చలు, వాదోపవాదాలతో పాటు, ఈ వాదనలకు అనుకూలంగా, ప్రతికూలంగా పుస్తకాలు కూడా వచ్చిన నేపథ్యంలో 'గీటురాయి' వారపత్రికలో మలిక్‌భాయ్ వెలువరించిన వ్యాసపరంపర మేధావులను, విమర్శకులను ఆకర్షించి, కొంత ఆలోచనకు తావు కల్పించింది.

మలిక్‌భాయ్ ఏదైనా చెప్పవలసి వస్తే, ఏమాత్రం దాచుకోకుండా, కుండబద్దలు కొట్టినట్టు చెబుతారు. ఆయన అభిప్రాయాలతో ఏకీభవించలేని వారు సైతం, ఆయన నిజాయితీని, నిష్పక్షపాత వైఖరినీ అభినందిస్తూ వుంటారు. ఈ వ్యాసాలలో కూడా ఆయన అనుసరించిన ఈ మార్గం అడుగడుగునా కనిపిస్తుంది. మలిక్‌భాయ్ యేమి రాసినా, ఆయన తన తాత్విక పునాదిగా స్వీకరించిన ప్రామాణిక ఇస్లామీయ సిద్ధాంతమే ప్రాతిపదికగా వుంటుందని మనందరికీ తెలుసు. తన ప్రజాస్వామిక, సెక్యులర్ ఆలోచనల వెలుగులోనే ఆయన విశ్లేషణ జరుగుతూ వుంటుంది. వరవరరావు వంటివారు కూడా ఈ వ్యాససంకలనం గురించి తన అభిప్రాయం రాయడానికి

మలిక్‌భాయ్‌లోని ఈ విశిష్ట వ్యక్తిత్వ లక్షణమే కారణమై ఉండాలి. ఈ వ్యాసపరంపర ముస్లిమ్ / ఇస్లామ్‌వాద రచయితల ఆలోచనా ధోరణిని యెలా ప్రభావితం చేయగలదో చెప్పలేము కానీ, చదువరులలో మాత్రం కొంత కొత్త కాంతిని నింపగలదని తప్పకుండా ఆశించవచ్చు.

**- దేవిప్రియ**

5 ఫిబ్రవరి, 2008

హైదరాబాద్

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

'సాహిత్యంలో దృక్పథం', 'సాహిత్యానికి తాత్వికత', 'సాహిత్యంలో వాదం' అన్న చర్చలు, వాదోపవాదాలు సాహితీ సభలలో, సాహితీ వ్యాసాలలో, సాహితీ పత్రికలలో బాగానే జరిగాయి. సర్వసాధారణంగా ఈ చర్చలు పాశ్చాత్య సాహితీకారుల సిద్ధాంతాల రాద్ధాంతాల ఆధారంగానే జరిగాయన్నది ఎవరు అంగీకరించినా అంగీకరించకపోయినా వాస్తవం మటుకు అదే. మన స్వంత ప్రమాణాలు, స్వతంత్ర సూత్రాలు, స్వేచ్ఛాయుత నిర్ణయాలు ఎక్కడా గోచరించవు. ఈ పూర్వరంగంలో ముందుకు సాగే ముందు సాహిత్యం, భాష, భావం, భావప్రకటన ఇత్యాది విషయాల పట్ల నా వ్యక్తిగత ఆలోచనలు, అభిరుచులు వ్యక్తీకరించడం భావ్యమేమో అని తలుస్తున్నాను.

## సాహిత్య గుణం

సాహిత్యం మానవ సృజనా శక్తికి నిదర్శనం. మనిషి తనలోని ఉన్నత భావాలు, ఉత్తమ అనుభూతులను విశిష్టరూపంలో వ్యక్తీకరించినప్పుడే ఉన్నత సాహిత్యం ఉనికిలోకి వస్తుంది. సర్వజనీనమయినది, సర్వదేశీయమయినది, సర్వకాలికమయినదే సదా ఉన్నత సాహిత్యంగా పరిగణించబడింది. వర్గం, వర్ణం, కులం, మతం పరిధులకు అతీతంగా, స్వచ్ఛమయిన మానవీయ మూల్యాలను ప్రతిఫలించేదే నిజమయిన సాహిత్యానికి సజీవ సాక్ష్యమయి నిలుస్తుంది. సభ్యసమాజంలో నేడు కూడా భద్రమయి ఉన్న సాహితీ సంపద, సంకుచిత ప్రాంతీయ, జాతీయ, వర్గీయ దురభిమానాలకు, ప్రయోజనాలకు అతీతమయి మానవీయ నైతిక మూల్యాలను బలపరిచేదే తప్ప మరొకటి

కాదు. షేక్స్పియర్, టాల్స్టాయ్, టాగూర్, ఇక్బాల్, వేమన ప్రభృతులు మానవీయ మూల్యాల వికాసమే తమ వస్తువుగా ఎన్నుకున్న కారణంగానే మహోన్నత సాహితీ స్రష్టలుగా ఎంచబడుతున్నారు.

మానవ చరిత్ర అంతా మంచీ చెడుల సంఘర్షణా ఫలమే. చెడుకు ఎదురుగా మంచిని బలపరచిన గాధలతోనే మానవుని వీర చరిత్ర సమస్తం నిండి ఉంది. ఈ సంఘర్షణకే మనిషి సదా విభిన్న నాగరికతా దశలలో గౌరవాదరణలు అందజేశాడు. అసత్యానికి ప్రతిగా సత్యానికీ, అన్యాయం, అక్రమాలకెదురుగా న్యాయానికి, మానవ సానుభూతికీ, మానవ విభజనకు సదృశంగా మానవ సమైక్యతకూ, దౌర్జన్యం, బలాత్కారాలకు ఎదురుగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు, క్రూరత్వానికి, అనాగరికతకు ప్రతిగా మానవ సోదరత్వానికీ సదా ఉన్నతంగా, ఉదారంగా ప్రాధాన్యతనిచ్చాడు మనిషి. ఈ ఉన్నత మానవీయ మూల్యాలను ప్రతిఫలించే సాహిత్యమే ఆదరణీయమయినది, మహోన్నతమయినది, మహోజ్వలమయినదీ, నిత్యత పొందినదిగా శాశ్వతంగా నిలిచేదిగా పరిగణించబడింది. దీనికి భిన్నంగా మానవుల్ని వర్గాలుగా, వర్ణాలుగా విభజించే తత్వాలను, మనిషిని ప్రాంతీయ, జాతీయ గదులలో, పరిధులలో బంధించివేసే సిద్ధాంతాలను సదా తిరస్కరిస్తూ వచ్చాడు మనిషి. గౌరవాదరణల ప్రమాణాలేవయినా, వంశం అని, వర్గం అనీ, ధనం అనీ, జాతి అనీ నిర్ణయించే శాస్త్రాలను మానవుడు మానవుడిగా ఎన్నడూ ఆదరించ లేదు, అసలు ఇష్టపడనే లేదు. ఈ దృక్పథాల కనురూపంగా ఉత్తమ సాహితీ సృష్టి కూడా ఎన్నడూ, ఎక్కడా జరగలేదు.

## సాహిత్య రూపం

భావం ఎంత సున్నితమయినదయినా, ఎంత అద్భుతమయినదయినా మరెంత ఉన్నత మయినదయినా వ్యక్తీకరణ పొందిక లేనిదయితే, భావ

ఔన్నత్యం, సున్నితత్వం సర్వనాశనమయిపోతాయి, ప్రయోజనం శూన్యమయి పోతుంది. ఏ కవి అయినా, ఏ కథకుడయినా, ఏ వక్త అయినా ప్రపంచంలో పేరుగన్నవారయ్యారంటే వ్యక్తీకరణలోని ఘనత ఆధారంగానే ఉత్తమ దశలకు, ఉన్నత శిఖరాలకు చేరగలిగారు. భావ వ్యక్తీకరణకు భాషే మాధ్యమం కాబట్టి భాషపై వారి పట్టు గట్టిదవడం మాత్రమే కాదు, భాష స్వాస్థత, సౌందర్యం కూడా వారి దృష్టిని ఎన్నడూ తప్పించుకుని దాటిపోలేదు. కవనంలోనయినా, కథనంలోనయినా, వక్తృత్వంలోనయినా జరిగే విన్యాసాలన్నీ పదాలు, పద బంధాలు, వాక్యాలు, వాక్యనిర్మాణాలతో జరిగే గారడీ తప్ప ఇంకేముందనీ!

నా దృష్టిలో, భాష, భావం, వ్యక్తీకరణలు ఆరోగ్యకరంగా, ఆహ్లాదకరంగా, ప్రామాణికంగా, ప్రబుద్ధనీయంగా ఉన్నప్పుడే అది స్వీకారయోగ్యమయిన సాహితీ కృషిగా భావించబడుతుంది. ఎవరికయినా పదాల రూపం, గుణం, వేషం ఆవిష్కృతం కాకపోతే, అవి అతని అవగాహనా పరిధికి సరిగ్గా చిక్కకనేపోతే, వాటి ఎంపికలో అతడు కృతార్థుడు కాలేడు. పదాల ఎంపికలోనే తప్పటడుగు వేస్తే వాటి ప్రయోగంలో నేర్పును ప్రతిఫలింపజేస్తాడని ఆశించ లేము. పదాలను పొందికగా పేర్చలేనివాడు సాహితీ కృషీవలుడు కాలేడు. రచయిత కాలేడు, కవి కాలేడు, వక్తా కాలేడు. రచనలో మనోజ్ఞత, కమనీయత, రమణీయత కేవలం భావసౌందర్యం వల్ల జనించదు. పదఔచిత్యం. వాక్య నిర్మాణమూ దానికి సహకరిస్తాయి. భావం, వ్యక్తీకరణలలో సామరస్యం, సమతూకం, సహచర్యం లేకపోతే ఉత్తమ సాహిత్యం ఉనికిలోకి రాదు.

మనిషి ప్రకృతి సిద్ధంగా రసజ్ఞుడు. స్వాదిష్టమయిన భక్షణలోని కమ్మ దనాలు, అతని జిహ్వాకు ఇష్టమవుతాయి. అందమయిన రూపాలు అతని కంటికి రుచిస్తాయి. పొందికయిన భవనాలు, అతని మనసును అలరిస్తాయి. సుందర దృశ్యాలు అతన్ని ఆకర్షిస్తాయి. ఉల్లాస పరుస్తాయి. మువ్వల సవ్వడి, కంఠరవళి, పిచ్చుకల సంగీతం అతని చెవులకు ఇంపుగా సోకి తనువును

డోలలూగిస్తాయి. సౌందర్యం ఏ రూపంలో గోచరించినా అతన్ని ఆనందం తన్మయత్వంలో ముంచివేస్తుంది. కవిత అయినా, వచన రచన అయినా, శబ్దంలో, అర్థంలో సంతులనం, సొగసు ఉన్నట్లయితే, అర్థశబలత, భావగర్భిత, అవగాహన సరళతలు సామరస్యం పొంది ఉన్నట్లయితే, శైలి ప్రవాహంలో పఠిత ఆంతర్యం మమేకమయి వేగాన్ని అందుకోగలిగితే, మానవ మనస్సునూ మస్తిష్కాన్నీ అది ప్రభావవంతం చేయగలుగుతుంది. అటువంటి సాహిత్యంలోని తేజమే ఎన్నటికీ తరగదు, నిత్య వసంతంలా సదా ఘుమఘుమలాడుతూ కిలకిలా నవ్వుతూ, గ్రీష్మతాపంలోనూ శ్రావణ జల్లులు వెదజల్లుతూ ఉంటుంది.

## సాహితీ క్షేత్రం

నా ఈ సాహితీ నిర్వచనం, నా స్వంతమే అయినప్పటికీ సహజమయింది, సహేతుకమయింది, సమగ్రమయిందని నేను గట్టిగా భావిస్తున్నాను. దీని దృష్ట్యా కేవలం, కవిత్వం, కథ, నవల, విమర్శనా సాహిత్యం మాత్రమేకాక, నైతిక, ఆధ్యాత్మిక కోణాలపైన వ్యాసాలు, రచనలు, ఇంకా సమకాలీన సామాజిక, ఆర్థిక, రాజకీయ అంశాలపైన వ్రాసిన గంభీర వ్యాసాలు సయితం, పఠితలను ఆకర్షించి చదివించగలిగినవయితే, చదువరుల ఆంతర్యంలో చోటు పొందగలిగినవయితే, పై లక్షణాలలో కొన్నింటినయినా పుణికిపుచ్చుకుని సృజన రూపం ధరించినవయినట్లయితే అవి కూడా సాహితీ సంపదగానే పరిగణించబడాలని నా దృఢాభిప్రాయం. అందువల్ల ఈ సాహిత్యాన్ని సయితమూ సాహితీ కొలమానాల ప్రకారం తులనాత్మక దృష్టితో పరిశీలించి ఇటువంటి వ్యాసాల సాహితీ ప్రమాణాలను, సాహితీ స్థానాన్నీ నిర్ధారించవలసి ఉంటుంది. అప్పుడే సాహితీ విమర్శ పరిపూర్ణమవుతుందని నా నిశ్చితాభిప్రాయం.

సాహితీ విమర్శకులు, సర్వసాధారణంగా తెలుగు వచన సారస్వతం పట్ల, అందునా 'శాస్త్రీయ వచన సారస్వతం' (Essays / Academic Writings)

పట్ల మొత్తానికి అలక్ష్యాన్నే కనబరిచారు. వచన సారస్వతంలోని కథ, కథానిక, నవల, నాటకం, వ్యగ్యం, హాస్యం తదితర ప్రక్రియలను మాత్రమే సాహిత్యంగా పరిగణించారు. వచన సాహిత్యంలో ఒక విమర్శనా వచనాన్ని మినహాయిస్తే వ్యాసం, గంభీర శాస్త్రీయ విషయాలను చర్చించే వ్యాసాలను ఏ కారణం చేతనో సాహిత్యానికి బాహ్యమయినదిగా పరిగణించారు. గంభీర శాస్త్రీయ వచన ప్రక్రియను ఆలోచితంగానో అనాలోచితంగానో 'సాహితీ' వర్గీకరణ నుంచే బహిష్కరించినట్లు గోచరిస్తోంది. ప్రపంచంలోని ఇతర భాషలకు సంబంధించిన సాహితీ వర్గాలు గనక ఇదే హ్రస్వ దృష్టినీ, ఇదే ఏకపక్షవైఖరినీ అవలంబించి ఉన్నట్లయితే సాహితీలోకం సారస్వత వారసత్వంలో దాదాపు మూడవ వంతును కోల్పోయి ఉండేది. కార్లాయిల్, రస్కిన్, జాన్ స్టూవర్ట్‌మిల్, కార్ల్‌మార్క్స్, ఫ్రెడ్రిక్ ఏంజెల్స్ ప్రభృతులు సాహితీవేత్తలుగా పరిగణించబడేవారు కారు. ఇరువయ్యో శతాబ్దిలో బెర్నార్డ్‌షా డ్రామాలనయితే సాహితీ సంపదగా పరిగణించేవారు. కాని ఆయన వ్రాసిన ప్రఖ్యాత భూమికలను వదలి వేసేవారు. ఆయన రచనలన్నింటిలో దాదాపు మూడవ వంతు భాగం ఈ భూమికలే ఆక్రమించుకున్నాయన్నది వాస్తవం. వాటిలోని చర్చనీయాంశాలు ఆనాటి ఆర్థిక, నాగరిక, తాత్విక విషయాలే. అలాగే ఆస్కార్ వైల్డ్, డి.ఎల్. లారెన్స్, జార్జిఆర్వెల్, టిఎస్ ఇలియెట్ ప్రభృతుల అగణ్యమయిన వ్యాసాలు సాహితీ సదనంలో కాలిడలేకపోయేవి. బర్ట్‌రెండ్ రస్సెల్, విన్స్టన్ చర్చిల్ వంటి రచయితల్ని అసలు సాహితీకారులుగానే అంగీకరించేవారుకారు. వాస్తవానికి ఈ సాహితీ బహిష్కరణే గనక సంభవించి ఉంటే దాని వేటును తప్పించుకుని నిలువగలిగేవారు బహుస్వల్పం.

తెలుగు విమర్శనా ధురంధరులు బహుశా మరచిపోయారో ఏమో; పరిశోధనా వ్యాసాలు రాజకీయ, ఆర్థిక, సామాజిక అంశాల పైన వ్రాసిన వ్యాసాలు సయితం, ఇతర సృజనాత్మక వచన రచనల్లానే వచన సాహిత్యంలో

భాగమే. తెలుగులోని వచన రచనలోని ఈ భాగం పట్ల ఒకవిధమైన పక్షపాతం మూలంగానే మన సాహితీ విమర్శల్లో వీటికి చోటు ప్రాప్తం కాలేదు. ఆ రంగం బహుధా కుంచించుకుపోయినట్లు అగుపడుతోంది. ఫలితంగా ఓ మహత్తర సాహితీ సంపద పట్ల అశ్రద్ధ, అలక్ష్యం చోటుచేసుకున్నాయి. వాస్తవానికి తెలుగు భాష, సాహిత్యాలు నేడు గడించిన ఉన్నత ప్రగతి శిఖరాల వెనక ఈ ప్రక్రియల పరోక్షపాత్ర ఉంది, అది అమూల్య మయినదన్నది నిర్వివాదాంశం.

## సాహిత్యం- దృక్పథం

సాహిత్యానికి ప్రయోజనం ఉండాలా వద్దా అన్న చర్చ కన్నా ముఖ్య మయిన అంశం, మానవ జీవితంలో, సమాజంలో, సాహిత్యానికున్న స్థానం ఏదీ అన్నది. సాహిత్యం జీవితంలో అంతర్భాగమన్నది వాస్తవం. అయితే జీవితం నిర్మాణ ప్రధానం అన్నదీ యదార్థమే. జీవితంలో విచ్ఛన్నానికి తావే లేదు. నిజానికి విచ్ఛిన్నంతో పోరాటం, 'నిర్మాణా'నికి ఆహ్వానమే జీవన సంఘర్షణకు సూత్రప్రాయమయిన నిర్వచనం, జీవితాన్ని సంఘర్షణగా పరిగణిస్తే, మంచీ చెడు, నిర్మాణం విచ్ఛిన్నం, ప్రయోజనకరం, హానికరం, సత్యం అసత్యం, న్యాయం అన్యాయం, ధర్మం అధర్మం - ఈ రెంటి పోరాటం గానే జీవితాన్ని నిర్వచించవచ్చు. ఈ పోరాటంలో సృజనాత్మక శక్తులు నిత్యం నిర్మాణాత్మక శక్తులకే బాసటగా నిలువాలన్నది స్థూలదృష్టితో చూసినా సహజంగా, సమంజసంగా అగుపడే వాస్తవం. ఆ విధంగా సాహిత్యం మంచికి పక్షపాతి, నిర్మాణ పక్షపాతి, ప్రయోజన పక్షపాతి, సత్య పక్షపాతి, న్యాయ పక్షపాతి, ధర్మపక్షపాతి, నీతి పక్షపాతి, నిజాయితీ పక్షపాతి- సకల సకారాత్మా లక్షణాలకు పక్షపాతి అని రూఢమవుతుంది.

ఈ సందర్భంగా కళ, సాహిత్యరంగాలలో తరచుగా వినవచ్చే ఈ సూత్రాలు లేక నినాదాలు పరిశీలనార్హమయినవి:

★ కళ కళ కొరకు,

★ కళ కాలక్షేపం కొరకు

★ కళ జీవన నిర్మాణానికి

ఈ సూత్రాలను పై సాహితీ నిర్వచనంతో సరిపోల్చి చూసుకున్నప్పుడు "సాహిత్యం జీవన నిర్మాణానికి" అన్న సూత్రం నాకు భావసామీప్యమున్నదిగా తోస్తుంది. లలిత కళలయినా సాహిత్యమయినా కృషి మాత్రం ఒక్కటే. సాహిత్యం ద్వారా సాహితీకారుడు తన ఆంతర్యంలో ఉత్పన్నమయ్యే ఊహలను, భావాలను బాహ్యంలో కలిగే అనుభవాల, సత్యాల వెలుగులో భాష మాధ్యమంగా వ్యక్తపరుస్తాడు. భావాలు, భావనలు, ఉద్రేకాలు, అనుభూతులు, అతని సృజనాశక్తితో ఊహాబలం ఆధారంగా మనోజ్ఞమయిన భాష రూపం ధరించి ఉనికిలోకి వస్తాయి. ఆ భావాలు, భావనలు, ఉద్రేకాలు, ఆలోచనలు పఠిత లేక శ్రోత గ్రహణశక్తిని చేరుకుని అతని ఉద్రేకాలు, ఆలోచనల్ని ప్రేరేపించి కార్యోన్ముఖుని చేయగలిగితే అది సాహిత్యం అనిపించుకో గలుగుతుంది. సాహిత్యం అతనిలో నిర్మాణాత్మక కార్యకుశలతను జనింపజేయగలిగితే అది నిజమయిన, సరయిన సాహిత్యంగా పరిగణించబడుతుంది. అందువల్ల సాహిత్యానికి ప్రయోజనం తప్పక ఉండాలని, సాహిత్యానికి ఓ సకారాత్మక, నిర్మాణాత్మక ప్రాతిపదిక కాగల సిద్ధాంతమూ దృక్పథమూ కావాలని విశ్వస నీయంగా, దృఢంగా, బలంగా చెప్పవచ్చు.

టి.ఎస్.ఇలియట్ ఎక్కడో చెప్పినట్టు గుర్తు, "సాహిత్య ప్రకర్ష, సాహిత్య ఔన్నత్యం అన్నది కేవలం సాహితీ ప్రమాణాల ఆధారంగా పరిశీలించబడదు, ఉత్తమ సాహిత్యం అన్నది నైతికత ద్వారా, ఆధ్యాత్మిక ప్రమాణాల ఆధారంగానే రూపొందుతుంది" (పదాలు నా స్వంతం) అని. నా దృష్టిలో నైతికతా విహీన మయిన సాహిత్యం హీనమయిన సాహిత్యం; నైతిక ప్రధానమయిన సాహిత్యమే ఉత్తమ సాహిత్యం. అదే నిజమయిన సాహిత్యం, అదే నిర్మాణాత్మకమయిన సాహిత్యం, అదే ప్రయోజనకరమయిన సాహిత్యం. అందుకే సాహిత్యానికి

వ్యక్తిగత ప్రయోజనమూ సామాజిక ప్రయోజనమూ ఉండాలని నేను గట్టిగా వాదిస్తాను. అది కవిత అయినా, కథ అయినా, నవల అయినా, వ్యంగ్య మయినా, హాస్యమయినా, విమర్శనా వ్యాసమయినా, మరేవిధమయిన గంభీర రచన అయినా ఈ గుణమున్నదే అసలయిన, నిజమయిన సాహిత్యం.

గంభీర రచనలు సయితం సాహితీ విలువల్ని ప్రదర్శించినట్లయితే వాటినీ సాహిత్యంగానే పరిగణించవలసి ఉంటుంది. వాటిలో – సృజనాత్మకత ఉట్టిపడుతూ ఉంటే, భావాలను ఊహల లతలలో పేర్చిన అనుభూతి నిండి ఉన్నట్లయితే, అవి పఠిత హృదయాన్ని కదిలించగలిగితే, పఠిత ఊహాజగతిని సజీవపరచగలిగితే, పఠిత ఆలోచనా శక్తిని ప్రేరేపించగలిగితే, పఠితలో అనుభూతుల ద్వారాలు తెరవగలిగితే, అటువంటి గంభీర రచనలు సయితం సాహితీ ప్రక్రియక్రిందికే వస్తాయి.

## సాహితీ వాదాలు

ఈ సాహితీ భావనల దృష్ట్యా సాహిత్యంలో వాదనలకున్న చోటేమిటో, వాటి ప్రాముఖ్యమేమిటో పరిశీలించవలసి ఉంటుంది. సాహిత్యం అంటే, జీవన నిర్మాణమని, సాహిత్యం అంటే సత్యదర్శనమని, సాహిత్యమంటే ధర్మ పోరాటమని ఆవిష్కరించు కున్నాము. దీని రీత్యా జీవితాన్ని నిర్వచించే దృక్పథాలు ఎన్నయినా కావచ్చు, జీవన నిర్మాణ పథకాలూ ఎన్నయినా ఉండవచ్చు, అలాగే సత్యదర్శన విధానాలూ, ధర్మపోరాట రంగాలూ ఎన్నయినా సాధ్యమే. తద్ఫలితంగా సాహిత్యంలో విభిన్నవాదనలు తలెత్తడానికి ఆస్కార ముంటుంది, అలాగే అనేక వాదనలు వెలిశాయి కూడా. ఒకటి మాత్రం వాస్తవం. జీవిత నిర్వచనం దష్ట్యా, జీవన సత్యం దృష్ట్యా, జీవన విధానం దృష్ట్యా, ఒక నిశ్చితాభిప్రాయం, ఒక నిర్దిష్ట దృక్పథం, ఒక వ్యవస్థీకృత సిద్ధాంతం ఉన్నప్పుడే, ఒక నిర్వచనం, ఒక నిర్మాణ పథకం రూపొందుతుంది, వాదన ఏర్పడుతుంది.

తెలుగు సాహిత్యక్షేత్రంలో తమదంటూ స్థానమేర్పరచుకున్న వాదనలకు పైన పేర్కొన్న విభిన్న అంశాలలో పటిష్ఠమయిన ప్రాతిపదికలే ఉన్నాయనడంలో సందేహం లేదు. ఎటువంటి భూమికలు, మౌలిక ప్రాధాన్యతలూ లేని వాదనలు ఎప్పటికప్పుడు కాలగర్భంలో అంతర్ధానమయి పోవడమో లేక అసలు నిలువకనే మైదానం వదలి కనుమరుగయి పోవడమో సంభవించింది. అది వాటి సహజపరిణామమే అనడంలో సందేహం లేదు. నేను ఈ పరామర్శలో తెలుగు నేలలో ఉద్భవించిన అనేక వాదాలు, వాదనలు, సిద్ధాంతాలు గ్రటాలు - అవి ఇంకా నిలద్రొక్కుకున్నవయినా, గాలిలో కలిసిపోయినవయినా - వాటిని స్పర్శించబూనటం లేదు. అదీ చేయదగిన ఒక సత్కార్యమే, కాని ప్రస్తుతం నా దృష్టిలో, నా ఆలోచనా పరిధిలో అవి లేవు. ప్రస్తుతానికి నా ఈ నివేదనల్ని ముస్లిమ్‌వాదం, ఇస్లాం వాదం వరకే పరిమితం చేసుకుంటున్నాను.

తెలుగునేలపై వెలసిన తొలి సాహితీ వాదం 'అభ్యుదయ వాదం'. కమ్యూనిస్టు సోదరుల ఈ అభ్యుదయవాదానికి ప్రాతిపదిక, వర్గ పోరాటం (క్లాస్ స్ట్రగుల్). అందులోనుంచే పుట్టినది 'వర్గవాదం'. వర్గవాదానికి మూల నినాదం 'తాడిత, పీడిత' జనుల గొంతుక వినిపించడం. ఆ గొంతుకలో తమ కంఠం సరిగ్గా వినిపించక పోయేసరికి 'తాడిత, పీడిత' గొంతుకను విభజనకు గురిచేసి, 'దళిత' వాదం, 'స్త్రీ వాదం' వేరుగా వినిపించసాగాయి. అలా కొంతకాలం అది వేరు వేరుగా వినిపించిందో లేదో, అందులో 'అంత ర్భాగం' అనుకుంటూనే 'మైనారిటీ' వాదం ప్రత్యేక కంఠంగా ఖంగుమన సాగింది. మైనారిటీ అంటే ఏ మైనారిటీ అన్న ప్రశ్న ఇంకా పూర్తిగా తలెత్తక ముందే 'ముస్లిమ్' వాదం అందులో నుంచి కొత్త రాగాన్ని అందుకుంది. ఈ చీలికలు, పేలికలు అన్నీ ఆ మూల మంత్రమయిన 'వర్గ పోరాటం'లో నుంచి ఉద్భవించినవే.

ఈ వాదనలన్నీ కేవలం సాహితీ గళాన్ని వినిపించడం మాత్రమే చేయలేదు. పైగా ఆయా వర్గాల వాస్తవ సమస్యల్ని లేక ఆయా వాదాల

పోషకులు సమస్యలుగా చిత్రించదలచిన వాటిని, పోరాట పటిమతో సాహితీ కరించడమే లక్ష్యంగా పెట్టుకుని ముందుకు వచ్చాయి. ఈ సాహిత్యంలో వర్గపోరాటాల అనివార్య లక్షణాలయిన ప్రచారాంశం (పబ్లిసిటీ ఎలిమెంట్), శత్రువు గుర్తింపు (ఐడెంటిఫైయింగ్ ది ఎనిమీ), సమస్యల విశ్లేషణ (ఎనలైజింగ్ ది ఇస్యూస్), సోదర వర్గీయుల మేలుకొలుపు (ఎవేకనింగ్ ది క్లాస్ ఫ్రెటర్నిటీ) వంటి విషయాలు దర్శనమిస్తాయి. ఈ వాదాలు బయలుపరిచే సమస్యలు అధికాంశం సర్వసాధారణంగా అన్ని వర్గాలూ అనుభవిస్తున్న సమస్యలే అయినా వాటి ప్రస్ఫోటన తీరు, వాటి అభివర్ణనా విధానం, వాటి ధ్వజీకరణ పద్ధతి వల్ల అవి ప్రత్యేక వర్గాన్ని ఆవహించిన విశేష పన్నాగ ఫలితాలుగా వ్యక్తమవుతూ ఉంటాయి.

ఈ వాదనల చరిత్ర, ఈ సిద్ధాంతాల ఆవిర్భావ సందర్భాలు, వాటి పూర్వా పరాలు, ఈ దృక్పథాలలో సంభవించిన క్రమానుగతి (సీక్వెన్స్) ఇత్యాది విషయాలను శాస్త్రీయంగా ఒక పద్ధతి ప్రకారం అమర్చాలంటే క్షుణ్ణంగా పరిశోధించిన వ్యక్తుల వల్లనే సాధ్యం. అవి ప్రస్తుతం నా విన్నపాల పరిధిలోకి చేరిన అంశాలు కావు. అలాగే ఈ వాదనల సాహితీసారం, తాత్వికచర్చ, సిద్ధాంతాల విశ్లేషణ కూడా నా చర్చనీయాంశం కాదు. వీటిని కేవలం నా అభిమతాన్ని ప్రస్ఫుటపరిచేందుకు ఆధారంగా మాత్రమే స్థూలంగా స్పర్శించడం జరిగింది. నా ఈ పరామర్శలో ఏవయినా వెనకాముందులు, క్రిందా మీదలు దొరిలి ఉన్నట్లయితే బాధిత మిత్రులకు మున్ముందే క్షమాపణలు కోరు కుంటున్నాను.

## ముస్లిం వాదం

ముస్లిం వాదం పేరుతో వచ్చిన సాహిత్యంలో ఇతోధికంగా కవితలే నేను చూశాను. అంటే నేను చూసిన దానిలో అత్యధిక భాగం కవితలదే అని అర్థం. నేను చూడని కవితలు చాలా ఉన్నాయి. ఆ కవితల తాత్వికతను,

సామంజస్యతను, సహేతుకతను విపులీకరించిన వచన రచనల్ని సయితం నేను దర్శించగలిగింది బహుస్వల్పమే అనుకుంటున్నాను. నేను చూడగలిగిన దానితోనే నాకు అంతా తెల్లవారిపోయింది. వాటి తాత్విక చింతనను సిద్ధాంతీకరించిన వ్యాసరచనలలోనూ కవితల సమర్ధనకు సంబంధించిన వివరణలే ఇతోధికంగా చోటుచేసుకున్నాయి. కాని ఆ వాదానికి భూమిక అయినటువంటి దృక్పథం కాంతిలో కవితా శిల్పాలనుగాని, సిద్ధాంత రచనల్నిగాని పరిశీలించిన రచనలు చూడటం తటస్థించలేదు. అందువల్ల రచనల ద్వారా సైద్ధాంతిక ప్రాతిపదికను వెదకవలసిందే తప్ప సిద్ధాంతమో దృక్పథమో ప్రమాణంగా పెట్టుకుని రచనల్ని విశ్లేషించే అవకాశం లేదు. ఇదీ నా అధ్యయనం రీత్యా ముస్లిమ్‌వాదం, దానికి ఆధారమయిన దృక్పథానికి ఉన్న సంబంధం. ఇప్పటి వరకు వచ్చిన విమర్శనా వ్యాసాలయినా, పరిశీలనా వ్యాసాలయినా, అధ్యయనా వ్యాసాలయినా వాటి ద్వారా తెలిసే దాన్నిబట్టి ముస్లిమ్ వాదానికి ఆద్యుడు ఖాదర్ మొహియుద్దీన్. ఆది గ్రంథం అయిన రచన 'పుట్టుమచ్చ', ఖాదర్ మొహియుద్దీన్ రచనకు వస్తువు, పేరును బట్టే వ్యక్తమయినట్లు, ఈ దేశంలో ముస్లిమ్‌గా పుట్టడమయినా, జీవించడమయినా అభిశాపంగా పరిణమించడం అన్నది. అదే దానిమూల వస్తువు. ఈ భావాన్ని అనేక పద చిత్రణలతో ఆయన పలువిధాలుగా స్పష్టపరిచాడు. ఈ రచన అందజేసిన సందేశం, దాని ప్రయోజనం, ముస్లిమ్ వ్యక్తికయినా, ముస్లిమ్ సమాజానికయినా ప్రాప్తమయిన లబ్ధి ఏమిటీ అని కాస్త గమనించవలసిన అంశాలు. ఆ పుస్తకం సామాన్య ముస్లిముల వరకు చేరగలిగిందా? కనీసం చదువుకున్న ముస్లిములకయినా అంది ఉంటుందా? చేరిన వారిలోనూ అది ఎందరిలో ఆత్మన్యూనతా భావాన్ని తొలగించగలిగింది. తాము జీవన రంగాలలో తమ ఉనికిని, వ్యక్తిత్వాన్ని రూఢపరచుకోవాలన్న ప్రబలవాంఛ (Strong desire to assert one self) ఎందరిలో కలిగింది? తమను అంటిపెట్టుకున్న

'పుట్టుమచ్చ' 'పుట్టు' మచ్చ కాదని, 'పెట్టుడు' మచ్చ అని రుజువు చేయాలన్న సంకల్పం ఎందరిలో ఏర్పడింది?

"పుట్టుమచ్చ"వల్ల ఆంధ్రప్రదేశ్ ముస్లిములలో 'మేధావి వర్గం' అనబడే వారిలో తాము ముస్లిములన్న చేతన జాగృతమయిందని కొందరంటారు. పూర్తిగా సమర్థించేందుకు లేక కాదనేందుకు తగిన వివరాలు నా వద్ద లేవు. 'మేధావి వర్గం' అనడం కన్నా కవితాభిరుచి, కవులు కావాలన్న ఉబలాటం ఉన్న వారిలో, కవులనబడుతున్నవారిలో ఆ చేతన కలిగిందంటే ఇంకా సబబుగా ఉంటుందేమో. సదరు కవులుగా చెలామణి అవుతున్నవారికి ఒక కవితా వస్తువు అనువుగా దొరికింది. అయితే ఖాదర్ మొహియుద్దీన్ అయినా లేక ఆ భావజాలాన్ని పోషించే ఇతర 'మేధావు'లయినా ఈ కవులు కాగోరుతున్న మేధావులకు మార్గదర్శకులుగా సేవలందించలేకపోయారు. ఫలితంగా ఆత్మన్యూనతాభావం పెరిగింది, ఆత్మనింద, ఆత్మదయ, స్వీయసానుభూతి, పరనింద, పరదూషణ, తిట్లపర్వం 'కవితలు'గా అలరారసాగాయి. కడకు తమ మూలాలను శంకించడం మాత్రమేకాదు, తమ ఆధ్యాత్మిక, నైతిక, సైద్ధాంతిక, సామాజిక, రాజకీయ భూమికల్ని, పీఠికల్ని సయితం "కూకటి వేళ్ళతో సహా" పెకిళించిపారవేసే తత్వం ఆ తలా తొకాలేని కవితల్లో చోటు చేసుకోసాగింది. దారి చూపేవారు, గమ్యం చేర్చేవారు ఎవరూ లేకపోవడం చేత దిశ నిర్దేశన లేని, గమ్యం తెలియని ఒక విచ్ఛిన్నకర ధోరణిని సాహిత్య ఉద్యమంగా, సాహిత్యవాదంగా మిత్రులు పెంచిపోషిస్తున్నారు. వీటి ఉదా హరణలు కోకొల్లలు. ఉటంకించడానికి కూడా మనసొప్పడం లేదు, సిగ్గనిపిస్తోంది.

## మూలభావన

ఈ వాదాలన్నీ 'వర్గవాదం' అనే మూల మంత్రంలోని శాఖోపశాఖలని లోగడ ప్రస్తావించుకున్నాము. ముస్లిం వాదం అనేది సయితం ముస్లిములు

కూడా దళితులు, మైనారిటీలు వంటి ఒక కుల ప్రాతిపదికన ఉద్భవించిన వర్గం అనే దృక్పథం ఆధారంగా రూపొందిన వాదం అనడంలో సందేహం లేదు. తొలుత ముస్లిములు కూడా పీడితులు, బాధితులు, ఉపేక్షితులు అవటాన దళితుల పోరాటంలో అంతర్భాగంగానే తమ పోరాటాన్ని కొనసాగించాలన్న భావన ఏర్పడింది. ఆ ధోరణికి ప్రభావితుడవడం చేతనే మా మిత్రుడు ఒకతను తన గుర్తింపు బాహాటంగా దళితులతో స్థిరపడాలన్న ధ్యాసతో తన పేరుకు ఇంటిపేరుగా 'దళిత్' చేర్చుకున్నాడు. పీడితులు, బాధితులు విభిన్న వర్గాలు కలసి ఉమ్మడి పోరాటం సాగించడం అన్నది అన్ని విధాలా శ్రేయస్కరమయిన విషయమే. ప్రజాస్వామిక వ్యవస్థలో ప్రజాబలం ఎంతగా వీలయితే అంతగా సమీకరించుకుంటేనే కోర్కెల సాధన అతిసులువవుతుందన్నదీ వాస్తవమే. 'పోరాటా'నికి అది సకల విధాల శోభించే అంశమే. అయితే దాని ఆధారంగా ఏ సముదాయమయినా, ఏ వర్గమయినా తన ప్రత్యేకతను, తన గుర్తింపును మిగతా వారితో విలీనం చేసు కోవడమో, లేదా దాన్ని లుప్తపరచుకోవడమో అవసరమా? ఏమో, అది ఆత్మహత్యా సదృశమని కొందరి అభిప్రాయం.

దీనికి అనుబంధంగానే మరో ప్రశ్న కూడా ఉద్భవిస్తుంది, ఈ పోరాటానికి అనుగుణంగా మరో దిశలో ప్రజాచైతన్యాన్ని మలచడానికి ప్రత్యేక సాహితీ ఉద్యమం కూడా అవసరమని భావించారు, బాగానే ఉంది. అయితే సాహితీ ఉద్యమం బాధితులందరూ కలసిసాగించడానికి బదులు బాధితులు, పీడితుల ఒక్కో వర్గమూ తమదంటూ ప్రత్యేక సాహితీ సంఘర్షణను వేర్వేరుగా సాగించడం కూడా అనివార్యమా? సాహిత్యం అన్నది కేవలం పోరాట క్షేత్రంలోని ఆయుధమేకాదు, అది దాన్ని ప్రదర్శించే వారి సైద్ధాంతిక, నాగరిక, సాంస్కృతిక, నైతిక విలువల ప్రతీకగా అలరారుతుందని మునుపు గమనించాము. అలాంటప్పుడు ముస్లిములు తాము కేవలం ఒక బాధిత వర్గంగా, ఒక పీడిత సముదాయంగా, ఒక ఉపేక్షిత జాతిగా మాత్రమే తమ

ఉనికిని నిర్వచించుకోవడం భావ్యమా? ఈ బాధలు, ఈ అడ్డంకులు, ఈ అవాంతరాలు, ఈ అంతరాలు భారత ముస్లిములకూ, భారతదేశంలోని ఇతర వర్గాలకూ మధ్య ఉన్నమాట వాస్తవమేకావచ్చు. అంతమాత్రాన ప్రపంచానికి 'ఇవ్వడమే'గానీ 'అర్థించడం' ఎరుగని ఒక విశ్వమహా సముదాయంగా ముస్లిముల బాధ్యత హక్కుల పోరాటం వరకు పరిమితమయిపోతుందా? ఇది వారి ఉనికి గల పరమార్థంతో సరితూగుతుందా?

ముస్లిములకు ఒక జాతిగా, ఒక సముదాయంగా, ఒక ప్రత్యేక జీవన పరమార్థంతో వెలసిన సామూహిక వ్యవస్థగా గుర్తింపు ఉంది. వారు ఎన్నడూ తమ హక్కుల కోసం పోరాడే, తమ స్వార్థం కోసం కృషి చేసే వర్గంగా (వేయ్యిన్నరేళ్ళ చరిత్ర) తమ చరిత్ర మొత్తాన, ఎక్కడా కానరారు. నేడు అటువంటి దుర్దశ వారికి దాపురించిందంటే కారణాలు వెదకవలసి ఉంటుంది. ముస్లిములు తమ హక్కుల కోసం కాదు, సదా తోటి మానవ సోదరుల హక్కుల కోసం పోరాడే వర్గంగానే దర్శనమిస్తారు. వారికి ఎన్నడూ తమ స్వార్థ ప్రయోజనాల చింత అంతగా బాధపెట్టలేదు, ఎల్లప్పుడు సాటి మానవులు కోల్పోతున్న సుఖాన్ని గురించి ఆలోచించేవారుగానే వినుతికెక్కారు. తాము ఏ హక్కులు కోల్పోయినా, ఏ నష్టాలను చవిచూడవలసి వచ్చినా సామాన్య ప్రజలకు అవి ఇప్పించగలిగితే అదే పదివేలని భావించేవారు. వారికి చేయబడిన బోధనలే అలాంటివి;

> "శ్రామికుని చమట ఆరకమునుపే అతని వేతనాన్ని చెల్లించండి."

> "తన పొరుగువాడు పస్తులుండగా తాను కడుపునిండా తిని నిద్రపోయేవాడు విశ్వాసి కాజాలడు."

> "అన్యాయాన్నీ అక్రమాన్నీ చూసి దాన్ని ఆపలేనివాడు, దాన్ని

అసహ్యించుకోనివాడు విశ్వాసపు కమ్మదనాన్ని ఆస్వాదించ లేడు."

అందుకే ప్రాగ్దేశ మహాకవి 'ఇక్బాల్' అన్నాడు-

*అప్ని మిల్లత్ కో కియాస్ అక్వామె మగ్రిబ్ పర్ న కర్*
*ఖాస్ హై తర్కీబ్‌మేఁ కౌమే రసూలే హాషిమి.*

(నీ సముదాయాన్ని పాశ్చాత్య జాతుల ఆధారంగా ఊహించుకోకు. హాషిమీ ప్రవక్త (ముహమ్మద్) ఏర్పరచిన సముదాయం దాని నిర్మాణం రీత్యా ప్రత్యేకమయింది.)

అయితే ఇదంతా వారి సామాజిక వ్యక్తిత్వానికి ప్రత్యేకతకు సంబం ధించిన అంశం. దీనికీ సాహిత్యానికీ, సాహిత్యంలో వాదానికీ, వాదంలో వివాదానికీగల సంబంధం ఏమిటీ? అదో నిర్భేద్యమయిన కోట, ఛేదించ సాధ్యంకాని చిదంబర రహస్యం. ఈ యువకులు ఏ శక్తులకయినా పావులుగా మారుతున్నారా లేక అమాయకంగా ఏదయినా ఊబీలో ఇరుక్కుపోతున్నారా? తమను తాము తెలుసుకోలేకపోతున్న ఆత్మవిస్మరణా స్థాయిలో కొట్టుమిట్టాడు తున్నారా లేక తమను తాము మోసపుచ్చుకుంటూ ఆత్మవంచిత ధ్యేయంతో, ఆత్మవంచన మృగతృష్ణతో దిక్కుదిశ కానరాక తిరగాడుతున్నారా? ఏమో!

## ఇస్లామ్ వాదం

ముస్లిం వాదంలో పొడసూపిన ఈ ధోరణిని ఏవగించుకున్న కొందరు 'ముస్లిం' సోదరులు, ముస్లిముల ధర్మానికి ఈ ధోరణి కేవలం పొసగనిదే కాదు, బహుధా ఇది ఇస్లామ్ వ్యతిరేక ధోరణే అని, అందువల్ల ముస్లిములుగా ప్రకటించుకునేవారికి అసలు ఇది ఎంత మాత్రం శోభించదని, వారు నిజంగా ముస్లిములే అయినట్లయితే ముస్లిముల సమస్యలనే ముందుకు తేవాలని కోరుకునేటట్లయితే తమ వైఖరి మొత్తాన్ని తాము ఆశ్రయించిన ఇస్లామ్

ధర్మానికి, దాని విలువలకు తగినట్టుగా, వాటి కనుగుణ్యంగా రూపొందించు కోవాలని పట్టుపట్టారు. ఇలా తాము ప్రతిపాదిస్తున్న దృక్పధానికి 'ఇస్లాంవాదం' అని నామకరణం కూడా చేశారు. గమ్మత్తేమిటంటే వస్తువు రీత్యా 'ముస్లిమ్ వాదం' రచనల్లోనూ 'ఇస్లాం వాదం' కవితల్లో, రచనల్లోనూ పెద్ద తేడా ఏమీ లేదు. ముస్లిముల సమస్యలే రెండు చోట్లా దర్శనమిస్తాయి. కాకపోతే ముస్లిం వాదులలోని అసభ్యత,అసహ్యత, అనాగరికత, అనైతికత, ధర్మ వ్యతిరేకత ఇస్లాం వాదులలో కానరాదు. ఇంకా పరనింద, పర దూషణ, శత్రువావిష్కరణ వంటి విషయాల్లో ఇస్లాంవాదులు ముస్లింవాదుల కన్నా ఎంతో 'వెనుకబడి' ఉన్నారని ప్రకటించవచ్చు. ఇది ఇస్లామ్‌వాదులు గమనించారో లేదో!

ఇస్లాం వాదులు విస్మరించిన మరో విషయం ఏమిటంటే ఇస్లామ్ ఏ విధంగా సర్వజనీనమయినదో ఇస్లామ్ ప్రతిపాదించే సాహితీ ధృక్పదం కూడా సర్వజనీన మయినది, సర్వజాతీయమయినది, సర్వకాలికమయినది, సర్వప్రాదేశికమయినది. ఏ విధమయిన ఎల్లల్లోనూ బంధించడం దానికి పొసగనిది, గిట్టనిది. ఇది దాని మౌలిక లక్షణం. రెండవ విషయం దానికి సైద్ధాంతిక ఆధారాలుగా, సుస్థిరమయిన కొన్ని మూల్యాలు, ప్రమాణాలు, భూమికలుంటాయి. దానికి ఒక లక్ష్యం, గమ్యం, దిశ, దారి ఉంటాయి. అయితే ఈ లక్ష్యం, ప్రమాణాలు దాని మౌలిక లక్షణానికి ప్రతిరూపాలయి ఉంటాయి, దాన్ని ఏ క్షణాన్నయినా వదలిపెట్టవు, ఏ సందర్భంలోనూ మీరిపోవు. ఇస్లామ్, మనుషుల్ని మతం ఆధారంగా, కులం ఆధారంగా, ప్రాంతం ఆధారంగా, జాతి ఆధారంగా, దేశం ఆధారంగా, భాష ఆధారంగా విభజించదు. మానవతే ఇస్లామ్‌కు మూల పదార్థం. ఉత్తమమయిన మానవీయ విలువలకు ప్రతీకగా నిలిచే సాహితీ సృజన, ఏ భాషలో, ఏ దేశంలో, ఏ జాతిలో, ఏ కులంలో, ఏ మతంలో, ఏ కాలంలో జరిగినా అది ఇస్లామ్ స్వంతం! మానవ ఔన్నత్యాన్ని, మానవ గౌరవాన్ని, మానవ స్వేచ్ఛను, ప్రతిఫలించే సాహితీ

కృషి ఎక్కడ, ఎప్పుడు జరిగినా ఇస్లామ్ దానికి అండగా నిలుస్తుంది. ఎటువంటి అవధులూ, అవాంతరాలు, అభ్యంతరాలూ దాన్ని అడ్డుకోలేవు, ప్రతిఘటించ లేవు.

## ఇస్లామ్- రసజ్ఞత

ఇస్లామీయ సాహిత్యం ప్రకృతిలోని అందాలను ఆస్వాదించడాన్ని కాదనదు. ప్రకృతి నిదర్శనాల ద్వారా జగతిలోని పరమార్థాన్ని గ్రహించడాన్ని ప్రోత్సహిస్తుంది. సువిశాల విశ్వప్రాంగణమంతా పరచుకున్న ప్రకృతి ధర్మానికి ప్రతికూలంగా కాక సానుకూలంగా, ప్రకృతితో సామరస్యం పొంది, ప్రకృతి వ్యవహరణలో అంతర్లీనమయి ఉన్న సంగీతంతో మమేకమయి సాగ మంటుంది. మానవుని ప్రగతీ వికాసాలన్ని ప్రకృతితో లయబద్ధమయి, మానవ మనుగడకు పరమార్థాన్ని గ్రహించి దాని సాధనకై చేసే కృషిలోనే ఇమిడి ఉన్నాయని, మనిషి జీవితానికి, అతని కృషికి, శ్రమకు ఓ గమ్యాన్ని, ఓ దిశను, ఓ దారిని సూచిస్తుంది. ఎల్లలెరుగని మానవతకు, మానవ ఆనందానికి, మానవ సుఖానికి దిక్సూచిగా దర్శనమిస్తుంది. మానవ జీవితంలో తలెత్తిన సమస్యలకు, బాధలకు, పీడనలకు, ఇబ్బందులకు పరిష్కారాన్ని, సమాధానాలను వెదికే ప్రేరణ కల్పిస్తుంది. బాధితులు, పీడితులు, ఉపేక్షితులు, బలహీనులకు అండగా నిలువాలని, మానవుని సహజ లక్షణాలయిన దయ, సానుభూతి, కరుణ, ప్రేమ, వాత్సల్యాలను ప్రోత్సహిస్తుంది. ప్రగతి అంటే, సుఖమంటే, ఆనందమంటే ఏ ఒక్క జాతికి, ఏ ఒక్క వర్గానికి, ఏ ఒక్క ప్రాంతానికి పరిమిత మయింది కాదు, అందరి ఆనందమే ఆనందం, ఎల్లరి సుఖమే సుఖం, అంతటా పరచుకున్నదే నిజమయిన ప్రగతి అని సర్వజనీనతను ఘోషిస్తుంది.

ఇస్లామీయ సాహిత్యం వైరాన్ని, విద్వేషాన్ని, వైషమ్యాన్ని, శత్రుత్వాన్ని పెంచదు. ప్రేమను పంచుతుంది, పరిమళాన్ని అందజేస్తుంది. శత్రువును మిత్రునిగా చేసుకోమంటుంది. చిరునవ్వును చిందించు, బదులుగా చిరునవ్వే

అందుకుంటావు, మానవడు సహజంగా శాంతి కాముకుడు, అతనిలోని ఆ సహజత్వాన్ని మేల్కొలుపు, మానవుడు సహజంగా సంఘజీవి, సంఘమంటే మానవులందరూ కలసినదే నిజమయిన మానవ సంఘం అని అవగతపరచు అని పురికొలుపుతుంది. కొందరు తెలిసీ ద్వేషాన్ని పెంచుకుంటే, తెలియక, అవగాహన లేక ముందున్న వారిని కళ్ళు మూసుకుని అనుసరించి ద్వేషంలో ముందుకు సాగేవారే అధికం. ఎటూ తేల్చుకోలేక సందిగ్ధంలో కొట్టుమిట్టాడే వారూ తక్కువేమీ కాదు, వీరందరినీ ఒకే కర్రతో తోలడం అంతగా సబబు కాదు. అవగాహనా ధ్యేయమున్న మంచి మనసులతో లోకం వట్టిపోలేదు. దివిటి పట్టి వెదకవలసిన అవసరమూ లేదు, చిరుదివ్వె వెలిగిస్తే చాలు పతంగాలన్నీ చేరువవుతాయి. వెలుగు పెరిగిన కొద్దీ నేస్తాలు ఎక్కువవుతాయి. ఇదే ఇస్లామీయ సాహిత్యం కోరే ప్రయోజనం. 'ఇవన్నీ చెప్పడానికి బాగానే ఉంటాయి. ఆచరణలో ఒక్క క్షణమూ నిలువ' వని చిత్తశుద్ధితోనే వాదించే సోదరులు లేకపోలేదు. ఆచరణలో పెడితే ఆలస్యంగానయినాసరే ఈ మాటలు అందమయిన ఫలితాన్నిస్తాయన్నది నా అనుభవం. ప్రయోగాలు చేస్తే అనుభవాలు అబ్బుతాయి. అనుభవాలు పంచుకుంటే మహాఉద్యమం రూపొందుతుంది!

ఇస్లామ్ పేరిట సృజనాత్మక కృషి జరుగుతున్న చోట దానికి ఏదో ఒక 'వాదం' పేరు కావాలన్న కోర్కె ఒకటుంది. దాని ఆంతర్యంలో ఒక సామూహిక వ్యవస్థ రూప కల్పనకు ప్రబల వాంఛ ఉన్నట్లు కనిపిస్తున్నది. అయితే ఒక నిర్మాణాత్మక కృషికి, అదీ సాహితీ క్షేత్రంలో జరిగే కృషికి, సామూహిక వ్యవస్థ అవసరమా? సాహిత్యం గొరెల్లా వార్ ఫేర్ పంథాను కదా అనుసరిస్తుంది, దానిని సంస్థాగత విధినిషేధాల బంధనాలు పట్టి ఉంచగలవా? సాహిత్యానికి సామూహిక వ్యవస్థ తప్పనిసరిగా అవసరమా? ఏ కృషికయినా సంస్థ అనేది ఉంటే ప్రగతి, విస్తృతి, సాహసం, సామర్థ్యం పేరుగుతాయన్న మాట వాస్తవమే.

కాని సృజనలో నవ్యత, ఊహలలో వైవిధ్యం లేనిదే సాహితీ పురోగమనం అన్నది సాధ్యపడదు, అవన్నీ 'వ్యవస్థ' ఎడారి యిసుకలలో ఇంకిపోతాయన్న ప్రమాదమూ లేకపోలేదు. నిబద్ధత పేరిట ఆలోచనల్లో పరిమితి; భావసామరస్యం, ఏకీభావం పేరిట ఒక విధమయిన Regimentation చోటుచేసుకునే ప్రమాదమూ ఉంటుంది. 'అభ్యుదయ'వాదులు, 'విప్లవ' వాదులకు దీని అనుభవం మెండుగా ఉంది. సాహితీ సమావేశాలు, సంస్థాగత చర్చలతో ప్రారంభమయి, సంస్థాగత వివాదాలతో ముగియవలసి వస్తుంది. అయినప్పటికీ ఎల్లెడలా ఒకే విధమయిన ఫలితాలే వెల్లడవుతాయని అనలేము. అయినా ఈ యదార్థాలను సయితం దృష్టిలో ఉంచుకోవలసి ఉంటుంది. ఇంతకూ నేను సంస్థను కాదనడం లేదు, దాని ప్రయోజనాలు దానికి ఉన్నాయి.

ఇప్పుడు చెలామణిలో ఉన్న వాదాల సంకుచితత్వం సోకని, వర్గతత్వం, ముఠాతత్వాలకు అతీతమయిన వ్యవస్థాగత రూపం ఏదయినా ఏర్పడితే నేను దానికి వ్యతిరేకిని కాను. అయితే ప్రప్రథమంగానే అటువంటి సంస్థ ఆవశ్యకత ఉందా లేక ఆ కోణంలో కృషి జరగడం ముఖ్యమా? అన్న ప్రశ్న వస్తే, ఎటు వంటి వ్యవస్థాగత రూపం లేకుండా, స్వేచ్ఛగా కృషి జరగడం తప్పనిసరి అని భావిస్తాను. ఆ కృషి క్రమంగా ఒక సాహితీ ఉద్యమరూపం దాల్చినప్పుడు, సహజంగానే అటువంటి అవసరం ఏర్పడితే దాన్ని తీర్చే ఏర్పాట్లు కూడా వాటంతట అవే సమకూరుతాయన్నది నా నమ్మకం. అందువల్ల సంస్థ ఏర్పాటు కన్నా నిర్మాణాత్మక సృజన మార్గంలో కృషి జరగడం, ఎన్నదగ్గ సాహిత్యం ఆ పంథాలో ఏర్పడేందుకు మార్గం సుగమం చేయడం ప్రస్తుతం రచయితల కర్తవ్యమని భావిస్తున్నాను. కల్తీలేని నాణ్యమయిన మేలిమి సరుకు రానంత వరకు జనం కల్తీ సరుకునే మేలిమి సరుకుగా భావిస్తూ స్వీకరిస్తారు. అంతేకాక కల్తీ సరుకు కోకొల్లలుగా వస్తే, అలా రావడమే దాని నాణ్యతకు తార్కాణం అని వాదించే ప్రబుద్ధులూ ఉంటారు. అందువల్ల నిర్మాణాత్మక సాహిత్య సృష్టి మెండుగా జరగడం నేడు అత్యంతావశ్యకం.

# ఇస్లామ్ - సాహిత్యం

## ప్రథమగుణం

సాహిత్యానికి గల సహజ గుణం, దాని నైజం, నైతికత. నైతిక ప్రధానమయిన సాహిత్యమే నాలుగు కాలాలపాటు నిలువగలిగింది, నాలుగు తరాలను అలరించ గలిగిందన్నది కాదనలేని వాస్తవం. సాహిత్యం - ప్రపంచ సాహిత్యం- సర్వజనీనమయిన విలువలకు, సర్వజనావళికి ఆమోద యోగ్యమయిన మూల్యాలకు, నిర్మాణాత్మకమయిన దృక్పథాలకు స్థానం కల్పించినప్పుడే తన స్థానాన్ని నిలబెట్టుకోగలిగింది. ఉన్నత శ్రేణి ప్రపంచ సాహిత్యంలో, అది ఏ భాష సాహిత్యమయినా, ఈ అంతర్గత తరంగం ప్రతిఫలిస్తూనే ఉంటుంది. ఇది దాని ఆదిమ లక్షణం. ఎటువంటి విలువలకూ నైతిక ప్రమాణాలకు ప్రాధాన్యత నివ్వని సాహిత్యం, అనుక్షణం విస్తురిస్తున్న సాహితీజగతిలో కక్ష్య తప్పిన తారకలా ఎటో అంతర్ధానమయి పోయిందన్నదీ వాస్తవమే. సాహిత్యంలో ఇలా దారి తప్పిన సాహిత్యం నామరూపాల్లేకుండాపోయే సంప్రదాయమూ ఆది నుంచి వస్తున్న సంప్రదాయమే. ఇదీ ఓ మరువరాని వాస్తవం.

మన యుగంలో అన్ని రంగాల్లోనూ రాజకీయాలే రాజ్యమేలుతున్నట్లు సాహితీ క్షేత్రాన్ని సయితం రాజకీయాలు ఆక్రమించుకున్నాయి. ఫలితంగా సాహిత్య సంస్థల్లో- సంస్థాంతర స్థాయిలోనూ, సంస్థాగత స్థాయిలోనూ రాజకీయాలే చోటుచేసుకున్నాయి. ఈ ఉరవడికి ఆది పురుషులు సామ్యవాద

సోదరులే అనక తప్పదు. సాహిత్యానికి వ్యవస్థాగత రూపునిచ్చి పెంచిపోషించిన వారు తామే గనక, ఆ వాతావరణాన్ని కలుషితం చేసే అధికారమూ తమకే ఉందని బహుశా భావించి ఉంటారు. అందుకే వాదాల నినాదాలతో సాహితీ రంగాన్నంతటినీ అరాచకానికి గురిచేయడంలో ప్రముఖ పాత్ర వహించారు. పర్యవసానంగా జీవన నిర్మాణం చేయవలసిన సాహిత్యం స్వార్థ రాజకీయ శక్తుల చేతుల్లో పావు(లు)గా మారి జీవితాన్ని ఛిన్నాభిన్నం చేసి వేసింది. అందుకే, ఎక్కడ చూసినా ఏదో ఒక జెండా, చిన్నదో పెద్దదో, చేతపట్టుకుని నినదిస్తూ, నినాదాల కీర్తనలు పాడుతూ కనిపిస్తారు సాహితీస్రష్టలు!

సాహితీ క్షేత్రంలో సంఘటిత కృషి మరొకటి లేకపోవడంచేత, సామ్యవాద సాహితీస్రష్టలు ఎల్లెడలా విలయతాండవం చేశారు. సాహితీ రంగాల్లోనేకాక సాహిత్యంతో సంబంధమున్న ప్రతిరంగంలోనూ- పత్రికా రంగంలోనూ, ప్రచారప్రసార కేంద్రాల్లోనూ, ప్రచురణా సంస్థల్లోనూ- వారే దండెత్తి దురాక్రమణలు జరిపారు. 'గొరిల్లా వార్ ఫేర్' జరపవలసిన సాహితీ కళారంగాల యోధులు నిబద్ధత, క్రమశిక్షణల ఆధారంగా ఒక పద్ధతి ప్రకారం సుసంఘటిత రూపంలో అన్ని రంగాలలోనూ దర్శనమివ్వగానే 'ఓహో కళా రూపాలకూ ఈ ఆకర్షణీయమయిన ఆకారం ఉందన్నమాట' అని అచ్చెరవు పొందిన నవకళాకారులు సహజంగానే అటుమొగ్గారు. పైగా శ్రీశ్రీ వంటి కవి ప్రాపగండా ఆయుధాలన్నీ పట్టుకుని ప్రస్థానానికి నాయకత్వం వహించడంతో ద్విగుణీకృత ఉత్సాహం, ఉద్వేగం, ఉత్తేజంతో 'అష్టపాది' అక్టోపస్‌లా వ్యాపించింది, సాహిత్యానికీ సంఘటిత ప్రయత్నం తప్పనిసరే అనే భావం. సంస్థాగత వెలుగులో నిగనిగలాడే సుఖమే వేరు!.

వ్యక్తిగత స్థాయిలో అత్యంత శ్రద్ధాసక్తులతో, దీక్షతో, కళా పిపాసతో జరిగే కళాసేవ సంస్థాగత ఆశ్రయంతో కొత్త రూపు ధరించింది. వ్యక్తులలో కీర్తిప్రతిష్ఠల లాలస ప్రజ్వరించింది. సంస్థ ఇచ్చిన ఊతంతో ఉద్వేగం పెరిగి బలం కొద్దీ కదం తొక్కసాగారు కవులు, కథకులు, రచయితలు, కళాకారులు.

ఈ కీర్తి ప్రతిష్ఠలు వారి సాహితీబలానికి మించిన స్థాయిలో, వారిలోని రచనా పరిపుష్టికన్నా అధిక పరిమాణంలో, వారి కళాసృజనాశక్తికి, కల్పనా స్థోమతకూ అందనంతటి రాశులలో ప్రాప్తమయ్యాయి. వారి ఊహలకు, ఆశలకు చేరనంతటి ఎత్తుల్లో వారిని తీసుకువెళ్ళి కూర్చోబెట్టాయి. కారణం, రంగంలో మరో దృక్పథం, మరో సిద్ధాంతం, మరో ఆలోచనా విధానం, మరో ఆచరణా మార్గం లేకపోవడమే. శూన్యం అనేది ఎంతో కాలం మనజాలదు గదా! స్పేస్‌ని ఎవరో ఒకరు ఆక్రమించవలసిందే!! ఇలా "అభ్యుదయ" వామపక్ష ధోరణులతో సంఘటిత కృషి సాహితీ క్షేత్రాన్నీ ఆవహించింది.

ఇంత అలజడి జరుగుతున్నా, ప్రాపగండాల ఉధృతికి అతీతంగా, ప్రశంస లన్నింటికీ దూరంగా నినాదాల హోరుకు ఎడంగా, ప్రశాంతంగా సాహితీ సేవ చేస్తూ జీవన నిర్మాణానికి కృషి చేస్తున్న వారు లేకపోలేదు, సంఘర్షణలకు సమాంతరంగా నిర్మాణాత్మక కళాసృష్టి కూడా జరుగుతూనే వచ్చింది. దానిగ్గాను తమ గుండెనెత్తుటిని నడిరేయి చమురు చేసుకుని సాహితీ జ్యోతుల్ని వెలిగించిన ధీమంతులూ ఉన్నారు. పొగడ్త లకు, ప్రశంసలకు, విమర్శలకు, విఘాతాలకు అతీతంగా, సహజంగానే నిరపేక్షా పరత్వంతో తమ కళాసృష్టి కృషిలో లోటురానివ్వకుండా నిరంతర ప్రయత్నం జరుపుతున్నారు. వారికి ఎటువంటి సంస్థాగత ప్రోత్సహం ఏ రాజకీయ అండదండలు లేకపోవడంచేత, వారిలో ఎటువంటి రాజకీయాలూ, రాజకీయ అరాచకాలూ స్థానమేర్పరచుకోలేదు. అదొక ప్రశాంత నిర్మాణ పథం.

## మతం - సాహిత్యం

తాత్కాలిక నినాదాల కళ్ళుజిగేల్ మనిపించే ఉద్వేగభరితమయిన వెలుగుల వరదలో రాజకీయ ప్రధానమయిన సంగ్రామాలను ఎన్నయినా సుడిగాలుల్లా రేపవచ్చు. కాని ఇటువంటి తాత్కాలిక తుఫానుల్లో సృజనకళ, సాహిత్యాలు మనగలుగుతాయా? ఇటువంటి సమయానుకూల సమస్యల ఉద్యమాలను సాహిత్యానికి ప్రాతిపదికలుగా నిర్మించే ప్రయత్నాలు ఎన్నడు,

ఎన్నెన్ని జరిగినా వాటి ఫలితాలు కళల్ని సాహిత్యాన్నీ శాశ్వత నిద్రకు గురి చేయడం తప్ప చేయగలిగిందేమిటీ. ఇటువంటి కళా ఉద్యమాల హంగామాలలో ఉనికిపుచ్చుకున్న సాహిత్యం ఆచిరకాలంలోనే కాలగతిలో కొట్టుకుపోయిందన్నది అనుభవం చెబుతున్న సత్యం. ఒక సాహితీ ఉద్యమానికి కావలసిన సైద్ధాంతిక బలిమి, సృజనాశక్తి ఇటువంటి నినాదాల గాలివానలలో ఏ కోశానా కాకనరాదు.

నైతికత, నైతికప్రమాణాలు, ప్రమాణబద్ధత అని అనగానే నైతికతకు ఆధారమయిన మతం, మతభావనలు కళ్ళ ముందు నిలుస్తాయి. అయితే మతం అన్నది స్తబ్దతకు, నిష్క్రియాపరత్వానికి, జడత్వానికీ, నిరంకుశ ప్రభువుల ఉక్కుపాదాల అణిచివేతలకు, కరడుగట్టిన మత గురువుల మూఢభావాలకు మారుపేరుగానే మనకు దర్శనమిస్తుంది. కొన్ని శతాబ్దుల పాటు మనం భావదాస్యం చేసిన పాశ్చాత్య పాలకులు, రచయితలు, తత్వవేత్తలు, శాస్త్రజ్ఞులు ఇదే మత చిత్రాన్ని మన ముందుంచారు, దాన్నే నమ్మమన్నారు. ఆ భావనలే నేడు మన విశ్వాసాలకు, సిద్ధాంతాలకు, శాస్త్రీయ అధ్యయనానికీ మూలాధారాలు. ఆ పరిధిలను అధిగమించి స్వంత పరిశోధనలతో, స్వతంత్ర ఆవిష్కారాలతో, స్వేచ్ఛాయుత అవగాహనలతో మనం ఆ మత భావననూ పరిశీలించిన పాపాన పోలేదు, ఇటు మతాన్నీ అవగతం చేసుకునే ప్రయత్నమూ చేయలేదు. పోతే మన స్వంత సిద్ధాంతాలను, స్వీయప్రాతిపదకల్ని నిర్మించుకునే అవసరం బహుశా లేదనుకున్నామేమో, పాశ్చాత్య గురువులు నేర్పిన విద్యలకు, వారి ఆదేశనిర్దేశాలకు అనుగుణంగానే అన్ని రంగాలలో పురోగమించ ప్రయత్నిస్తూ ఉంటాము. సాహిత్యంలోనూ అంతే. ఎవరు అవునన్నా, కాదన్నా వాస్తవం మటుకుఇదే.

ఈ పూర్వరంగానికి తోడుగా సాహితీ ఉద్యమంగా సాగుతున్న అభ్యుదయ సోదరులు సయితం 'మతం అంటే మత్తుమందు' అని నిర్వచించి మస్తిష్కాలను పకడ్బందీగా కలుషితం చేసివేశారు. ఏ మత భావనను

మత్తుమందని 'మార్క్స్' పేర్కొన్నాడో తెలుసుకోవాలన్న కనీస జిజ్ఞాస నన్నా చూపలేదు మన 'అభ్యుదయ' సోదరులు. ఫలితంగా దైవం, దైవగ్రంథం, నీతి, నియమాలు, ఆధ్యాత్మిక మార్గబోధన- అన్నీ ఛాందసత్వం క్రింద లెక్కించబడ్డాయి. మతం కన్నా జీవన విధానంగా, మానవ ధర్మంగా, మాన వాళికి దారిచూపే ధర్మం ఏదయినా ఉందా అన్న అన్వేషణ పూజ్యమయి పోయింది.

పాశ్చాత్యులు అందజేసిన ఈ మత భావన వారి చుట్టుపట్లనున్న వాతావరణంలో నుంచి ఉద్భవించింది. వారు పరిశీలించిన, అనుభవించిన మతం అలాంటిదే. శతాబ్దుల తరబడి తమపై రాజ్యమేలిన మత భావన అది. ఆలోచనాత్మక స్తబ్దత, మత గురువుల సంకుచితత్వం, పాలకుల దౌర్జన్యకాండ ఆధారంగా ఏర్పడిన భావన అది. అది జీవన సంఘర్షణ నుండి తప్పించుకుని, ఆత్మగుమ్మటంలో ఖైదీ అయి, అడవుల్లో, ఎడారుల్లో, కొండల్లో, శ్మశానాల్లో, సమాధుల్లో ఉనికిని వెదుక్కునేందుకు దారిచూపే భావన. మహా అయితే కొన్ని పూజాపురస్కారాలు, ఆరాధనలు, ఆచారాలు, ఆరాధనా లయాలలో బందీగా ఉంచే భావన అది. జీవితాన్ని మతపరమయినదిగా, ప్రపంచ పరమయినదిగా విభజించే భావన అది. ఇటువంటి మతానికి వెలుపలి ప్రపంచంలో రాజ్యమేలే ఏ వ్యవస్థ సమక్షంలోనయినా సరే చేతులుచాచి, తలవంచి, మోకరిల్లి, సాగిలపడి జీవించమని బోధించే మత భావన అది!

## సాహిత్యం - తాత్విక భూమిక

ఇటువంటి మత భావన జీవన కళ తొణకిసలాడే సాహిత్యానికి, కళలకూ ఎన్నడూ ఆధారభూతం కాజాలదు. జీవితంతో అత్యంత సన్నిహిత మయినదే నిజమయిన సాహిత్యం. జీవితమంటే సంఘర్షణ- మంచీచెడుల సంఘర్షణ; న్యాయాన్యాయాల సంఘర్షణ; ధర్మాధర్మాల సంఘర్షణ. ఈ సంఘర్షణామయ జీవితంలో ఉత్పన్నమయ్యే సాహిత్యానికి ఆ కరడుగట్టిన మతభావనకూ సంబంధమేమిటీ? అయితే ఉత్తమ మానవీయ విలువలతో

పాటు, జీవన సంఘర్షణలో ప్రముఖపాత్ర నిర్వహించే మతం, ధర్మం, సంచలనాత్మకమయిన ధార్మిక భావనే సాహిత్యానికి భూమిక, ప్రాతిపదిక కాగలదు. ఇటువంటి సంఘర్షణలో ప్రజ్వరిల్లిన ఆవేదనే హృదయాంత రాళాల్లోని లోతుల్లో అవతరించి, ఆత్మలో అంతర్లీనమయి అప్రయత్నంగా పదాల రూపుధరించి కాగితంపైన విస్తరిస్తుంది. కళాకారుడిని, రచయితను ఏదయినా ప్రేరకశక్తి జీవన రణరంగంలోకి త్రోసి మంచీచెడుల సంగ్రామంలో పాల్గొనేలా చేయనంతవరకు సజీవ సాహిత్యం ఉనికిలోకి రాదు. ఆ ప్రేరకశక్తి, ఆ సిద్ధాంతం, ఆ దృక్పథం బలీయమయినదీ జీవన సంఘర్షణలో క్రియాశీల పాత్ర పోషించగలదవడం అనివార్యం. ఇస్లామ్ ఇటువంటి ప్రాతిపదికనే ప్రసాదిస్తుంది.

సాహిత్యాన్ని, దాని ఈ మూలాలను, మూల్యాలను, ఆవశ్యకతలను దృష్టిలో ఉంచుకుని, ఇస్లామీయ జీవన సిద్ధాంతాన్ని, దాని సైద్ధాంతిక వివరాలను, జీవితంలో దాని ఆచరణాత్మక అన్వయింపును పరిశీలించాలి. ఈ సిద్ధాంతంలో కళాకారుని, సాహితీ కృషీవలుని సృజనాశక్తికి ప్రేరణకాగల, అతని అంతరంగ భావనాత్మక క్రియాశీలతను పురికొల్పగల బలం పుష్కలంగా ఉందని ద్యోతకమవుతుంది. ఇస్లామ్ ప్రతిపాదించే మౌలిక సిద్ధాంతాలలో, కళాకారుని అంతరంగ భావనాత్మక ప్రపంచంపై పట్టు సాధించగల బలముంది; దాన్ని తన ప్రత్యేక మూసలో పోతపోయగల, విశేషరూపంలో మలచగల ఆకర్షణ, ప్రేరణ ఉన్నాయి. కళాకారుడి జీవితంలో, ఆధునిక సిద్ధాంతాలు తెచ్చిపెట్టిన ద్వంద్వ నీతిని తుడిచి పెట్టి, అతని ఆలోచనా జగతిలోనూ ఆచరణ లోకంలోనూ ఏకాత్మకతను సాధించగల సత్తా కేవలం ఇస్లామీయ జీవన దృక్పథంలోనే ఉందనే సత్యం దర్శనమిస్తుంది.

ఇస్లామీయ జీవన దృక్పథంలో, దాని వ్యవస్థలోగల ప్రత్యేకమయిన విశేషగుణం ఒకటుంది. అది ఇతర మతపరమయిన, సిద్ధాంతపరమయిన

వాదాలవలే కళాకారుణ్ణి సందిగ్ధావస్థలో, ఆశ్చర్యచకితుణ్ణి చేసి వేయదు. మూఢభావనల ఊహాజగత్తులో, నిరాశా నిస్పృహల మధ్య దిక్కూ దిశా కానరాని అసహనీయమయిన పరిస్థితుల మధ్య వదలిపెట్టి పారిపోదు. అది అతి సహజంగా ప్రకృతి సిద్ధమయిన రీతిలో సకారాత్మక ప్రమాణాలను పరిచయం చేస్తుంది. మానవ ప్రకృతికి, అతని చుట్టూవున్న జగతికీ సామరస్యాన్ని కల్పించి విశ్వాన్ని అతని ఆత్మతో మమేకపరచగల సిద్ధాంత రూపాలను అందజేస్తుంది. ఈ మౌలిక భావనలు, మూల్యాలు అతన్ని జీవితంలో సంఘర్షణకు కార్యోన్ముఖుని చేసి ముందుకు నడుపుతాయి. అడుగడుగునా తోడుగా నిలుస్తాయి. ప్రతి మలుపులో సక్రమమయిన మార్గదర్శకత్వం వహిస్తాయి. జీవిత పరమార్థాన్నీ, గమ్యాన్ని చేర్చే సువిశాల రాచబాటనూ సూచిస్తాయి.

ఇస్లామ్ కళాకారుడి సమక్షంలో ప్రకాశమానమయిన భావనలు అతిస్పష్టంగా విశదపరుస్తుంది. ఈ సృష్టి సర్వమూ 'మాయ'కాదు 'శూన్యమూ' కాదు. ఇదొక వాస్తవికత, ఇదొక ఆవశ్యకత, ఇదొక క్రియాశీలత. అయితే ఇదే సర్వమూకాదు, ఇదే అంతమూకాదు, ఈ గగన భువనాలకు ఆవల కూడా జగతి సువిస్తరమయి ఉంది. ఈ మజలీని దాటి మరో జగతిన ప్రవేశించవలసి ఉంది. జీవితం నిత్య క్రియాశీలం, లోకం అనంతం, ప్రస్థానమూ అనంతమే. ఆ అనంత గమ్యాన్ని అందుకోవడమే మానవ మనుగడకు పరమార్థం అంటూ సువిశాల క్రియాశీల జగత్తును మనిషి సమక్షంలో పరచిపెడుతుంది. ఈ సకారాత్మక దృక్పథం జీవితం పట్ల ఆసక్తిని అనురక్తిని ఆశను సృజిస్తుంది.

ఇస్లామ్, మానవుని మనుగడకు, ఈ జగతికి, ఈ ఉనికిపట్టుకు ఒక దృఢమయిన, పటిష్టమయిన, సుస్థిరమయిన మౌలిక భావనను, సక్రియ మయిన నిర్వచనాన్ని ప్రతిపాదిస్తుంది.

"ఇక్కడ ఏదీ వృథాగా, అనవసరంగా సృజించబడలేదు"

(దివ్యఖుర్ఆన్)

ఈ ప్రపంచం, జీవన కళతో కళకళలాడే ఈ విశ్వం ఏదో ఆటలాడు కునే వాడి కాలక్షేపానికి అనాలోచితంగా ఏర్పడ్డ క్రీడా స్థలికాదు. ఏదో దానంతటఅదే ఉనికిలోకి వచ్చిన అర్థరహితమయిన మాయ అంతకన్నా కాదు. ఇదొక పథకం ప్రకారం, ఒక ఉద్దేశ్యంతో సృజించబడ్డ వ్యవస్థ. ఇక్కడ జరిగే ప్రతి కదలికకూ, సకల కార్యకలాపాలకు, ఒక స్పష్టమయిన లక్ష్యముంది. మనిషి తన విచక్షణా జ్ఞానాన్ని, బుద్ధి కుశలతను, సృజనశక్తిని, క్రియాశీలతను వినియోగించి ఈ జగతిన మానవ మనుగడను ఆనంద మయం, ప్రగతి శీలం, శుభకరం చేయాలని అది కాంక్షిస్తుంది; నిర్మాణం దీని గుణంగా, మానవ ఔన్నత్యం దీని ఆశయంగా పురోగమించాలని ఆశిస్తుంది.

పాశ్చాత్య తాత్వికత మనిషిపైన మోపిన భావభారం వల్ల మానవుడు ద్వంద్వ నీతికి గురయ్యాడు. ప్రపంచం, ప్రపంచ వ్యవహారాలు, ప్రపంచ అవసరాలు, వాటి సాధన వేరని, పరలోకం, పరలోక జీవితం, పరలోక ఆవశ్యకతలు, పరలోక సాఫల్యం సాధన వేరని, మనిషి జీవితాన్ని అది విభజించింది. నైతికత, నైతిక ప్రమాణాలు, భౌతికత, భౌతిక ప్రమాణాలు రెండు భిన్న ధ్రువాలని బోధించింది. కైసరుది కైసరుకివ్వమని దైవానిది దైవానికి చెల్లించమని ప్రేరేపించింది. ప్రపంచం పరలోకమార్గంలో ఈదరాని సముద్రమని, పరలోకం ప్రపంచ ప్రగతీ వికాసాలకు హిమాలయాలవంటి అడ్డుగోడ అనీ నిర్వచించింది. ఫలితంగా నీతిని, నిజాయితీని, న్యాయాన్నీ సాపేక్షకమయిన విలువలుగా పరిగణించింది. ఈ తాత్విక చింతన కళలపైన ముఖ్యంగా సాహిత్యంపైన చెరగని ముద్ర వేసింది. సాహితీకారుడు ద్వంద్వ నీతికి, ద్వంద్వస్వభావానికీ, ద్వంద్వ ఆలోచనకీ బానిసయిపోయాడు. సందిగ్ధత, అనిశ్చితత అతని మనోవ్యాపారమయిపోయింది.

దీనికి భిన్నంగా ఇస్లామ్ మానవుని నైజం, ప్రకృతులను గురించి అందజేసే భావన సకారాత్మకమయినది. మానవుడు ప్రకృతి సిద్ధంగా, తన

సహజనైజం రీత్యా సదాచార స్వభావుడని ఇస్లామ్ అంటుంది. మానవునిలో చీకటి వెల్తురులు, మంచీచెడులు, సమ్మిశ్రమమయి ఉన్నా అతని మ్రొగ్గుదల మంచి వైపునకే ఉంటుందని, అతని పిపాస వెలుగునే కాంక్షిస్తూ ఉంటుందని చెబుతుంది. మనిషి, వాతావరణం ప్రభావంతో దౌష్ట్యాన్ని, దౌర్జన్యాన్నీ, అత్యాచారాన్నీ, అధర్మాన్నీ, అంధకారాన్ని తాత్కాలికంగా ఆశ్రయించినా అతని ఆంతర్యం ప్రేమ, సానుభూతి, సోదరభావం వంటి మానవీయ భావనలకే ప్రాధాన్యమిస్తుంది. అప్పుడప్పుడు వాతావరణంలోని కాలుష్యం వల్ల అతని అంతరాత్మ కాస్త చీకటిని ఆశ్రయించినా చీకటి అతని ఆవాసం కాజాలదు. అసహనీయమయిన అశాంతితో అక్కడి నుండి కదలివచ్చేస్తాడు. ఉన్నత ఆశయాలే అతని గమ్యాలు. కళాకారుడు, మరీ ప్రత్యేకంగా సాహితీకారుడు మనిషిలోని అంతరాత్మను జాగృతపరిచే ఆయుధంగా, వైతాళికునిగా ముందుకు వస్తాడు. అతను మానవీయ విలువలకే విలువనిచ్చేవాడిగా మారుతాడు. మనిషిని స్వార్థచింతన నుండి వెలికితీసి, భోగలాలసల నుంచి జీవన దిశను మరల్చి, మానవుని ప్రకృతిని పరిరక్షించే వానిగా పరివర్తింపజేస్తుంది.

మానవుని గురించి ఇస్లామ్ ఒక యదార్థాన్ని సదా సాహితీకారుని సమక్షంలో ప్రకటిస్తూ ఉంటుంది:

> మానవుణ్ణి మేము నిశ్చయంగా అత్యుత్తమ పోతలో మలచి సృష్టించాము. *(దివ్యఖుర్ఆన్)*

మానవుడు సహజసిద్ధంగా "పాపాత్ముడూ" కాడు, అతన్ని రక్షించడానికి మరెవరయినా ప్రాణత్యాగమో, ఆత్మార్పణమో చేసుకోవలసిన అవసరమూ లేదు. మానవుడు తన సృజనరీత్యా అత్యుత్తమ శైలిలో; రూపం, గుణం, మేధ, శక్తి, సామర్థ్యాలు, ప్రకృతి, ప్రవృత్తుల రీత్యా అత్యున్నత ప్రమాణాల కనుగుణంగా మలచబడ్డాడు. అందువల్ల అప్పుడప్పుడు తప్పటడుగులు వేసినా అతని పట్ల నిరాశ చెందవలసిన అవసరం లేదు. మనిషి ఎప్పటికయినా తన మూలాల వైపునకు మరలకుండా ఉండడు. మానవునిలోని బలహీనతల్ని

గుర్తిస్తాడు ఇస్లామీయ సాహితీకారుడు. అయితే అవి మధ్యలో అబ్బిన అసహజమయిన పోకడలే అనీ నమ్ముతాడు. ఈ బలహీనతలు అతనికి అసహజమయినవి కావడంచేత నిత్యం అతనితోపాటు నిలవవు, సహజ మయిన, శాశ్వత విలువ కలిగిన లక్షణాల వైపునకు అతని నైజం మరలడం తథ్యం అనీ విశ్వసిస్తాడు. అందువల్ల ఇస్లామీయ సాహితీకారుడు మనిషిని అటువంటి సహజత వైపునకు మరల్చడానికి, అతని ప్రకృతి సిద్ధమయిన ఉనికి పట్టులోకి ప్రవేశింపజేయడానికి ప్రయత్నిస్తాడు.

## జీవన యదార్థం - అధ్యయనం

ఈ భావనల రీత్యా ఇస్లామీయ సాహితీకారుడు మానవుని లోపాలను, అసహజమయిన బలహీనతలను భూతద్దం పట్టి చూపెట్టడానికి, తన సాహితీ కృషిలో ప్రతిబింబింపజేయడానికి ససేమిరా అంగీకరించడు. మానవునిలోని అధమ స్థాయి పోకడలు స్వయంగా మనిషినీ అనునిత్యం వేధిస్తూ ఉంటాయి. అంతరాత్మలోని సహజత్వం సజీవమయి ఉన్న మనిషి ఆ బలహీనతల్ని దాటి, సహజమయిన, శాశ్వతమయిన విలువల వైపునకు మరలే ప్రయత్నమే చేస్తాడని చిత్రిస్తాడు. మానవుని నకారాత్మక పాత్రలనుకాక సకారాత్మక, నిర్మాణాత్మక, సృజనాత్మక భూమికల్ని ప్రకాశమానం చేసి మరీ ప్రతిఫలింపజేస్తాడు తన రచనల్లో. జీవితపు ఒడిదుడుకుల్లో, అత్యంత కఠినమయిన మార్గాల్లో, కంటక ప్రాయమయిన త్రోవల్లో, చిక్కులతో కూడిన వ్యవహారాల్లో మనిషి దారితప్పి పెడత్రోవలు త్రొక్కకుండా మార్గనిర్దేశన చేస్తాడు. సహజమయిన, సరళమయిన రుజుమార్గాన జీవితం సాగేందుకు అంతరాత్మను జాగృతపరిచే సన్నివేశాలను ఎత్తి చూపుతాడు. అతని సాహితీకృషి హేయమయిన భావనలకు దర్పణం కావడం కన్నా ఉన్నత మూల్యాలకు మార్గదర్శకత్వం వహించేదిగా ఉంటుంది.

మనిషిలో నకారాత్మక భావనలు, హీనమయిన, నీచమయిన కోర్కెలను జనింపజేసే సాహిత్యాన్ని ఇస్లామ్ సమర్థించదు, ఖండిస్తుంది, వ్యతిరేకిస్తుంది. మనిషిలో ఉన్నత మానవీయ ఆశయాలను ప్రేరేపించే, ఉత్తమ నైతిక ప్రమాణాలను సృజించే, జీవితపు చీకటి దశల్లోనూ కాంతి కోణాలను దర్శింపజేసే శక్తిని సాహిత్యం ద్వారా మానవునిలో సృజించాలని ఆశిస్తుంది. దానికి ప్రతిగా మనిషిని ఈ మహత్తరమైన ఎత్తుల నుండి అసహ్యమయిన పాతాళాలకు త్రోసివేసి, పాశ్విక లక్షణాల స్థాయికి చేర్చే సాహితీ ప్రదర్శనల్ని ప్రతిఘటిస్తుంది; అటువంటి విలువలను ప్రతిఫలించే సాహిత్యాన్ని నిరసిస్తుంది. సాహిత్యంలో పాత్రల ఎంపిక, పాత్రల పోషణ, చిత్రణ, లైంగిక భావనల ప్రదర్శన విషయంలో ప్రతీకాత్మకతను, గోప్యతను అభిలషణీయంగా భావిస్తుంది. మానవుని సున్నిత భావనల చిత్రణలో నగ్నత్వాన్ని, దిగంబరత్వాన్ని అది గర్హించక మానదు. దివ్యఖుర్ఆన్‌లోని యూసుఫ్ సూరా ఈ భావప్రకటనా శైలికి అత్యుత్తమ నిదర్శనంగా, ఉన్నత ఉదాహరణగా నిలుస్తుంది.

ఇస్లామీయ సాహిత్యం జీవితాన్ని ఒక గంభీర యదార్థంగా స్వీకరిస్తుంది. దాన్ని మాయగా, క్రీడగా, వినోద కాలక్షేపంగా, విలాసమయంగా, సరదాగా గడిపి పారవేయవలసిన విషయంగా భావించదు. జీవితపు భౌతిక అవసరాలనన్నింటినీ, వాటి మహత్తును అంగీకరిస్తుంది. వీటిని ఉన్నతీకరించి, పరిశుద్ధపరచి సాహిత్య కృషిలో ప్రదర్శించడానికీ సమ్మతిస్తుంది, సమర్థిస్తుంది. కాని 'వాస్తవికత దృష్టి' పేరుతో పశుప్రాయమయిన రీతిలో ఉదరపోషణకు, లైంగిక తృష్ణకు అసంబద్ధమయిన, అమానవీయమయిన ప్రాధాన్యతనిచ్చి, జీవన పరిమాణం కన్నా పెద్ద సైజు (Bigger than life size)లో చూపెట్టడానికి ఎన్నడూ అంగీకరించదు. మనిషిని ఒక బాధ్యతాయుత, చేతనాశీల, ప్రేమానురాగాలు మూర్తీభవించిన వ్యక్తిత్వంగా, నిజమయిన ఉన్నత

మానవునిగా దర్శించాలని, ప్రదర్శించాలని అభిలషిస్తుంది. ఇదీ ఇస్లామీయ సాహిత్యపు సువిశాలమయిన తెర. ఇందులో సృజన, నిర్మాణ పథక రూపంలో జరుగు తుంది. అది వినాశ హేతువు ఎన్నటికీ కాదు. ఎవరయినా దాన్ని మార్చడానికి ప్రయత్నించినా అది సహించదు. అటువంటి ప్రయత్నాలను కూలగొడుతుంది, నాశపరుస్తుంది. ఈ వినాశమూ నిర్మాణమే.

ఇస్లామ్ కళాకారునిలోని రసజ్ఞతను జాగృత పరిచే వాతావరణాన్ని సృజిస్తుంది. మానవుని ఊహకు, ఆలోచనకు యదార్థప్రాతిపదికల్ని, జ్యోతిర్మయ భూమికల్ని ప్రసాదించాలని కోరుకుంటుంది. యదార్థ జ్ఞానాన్ని ప్రత్యూష కాంతిలా, మలయ సమీరంలా కళాకారుడిలో ప్రవేశింపజేస్తుంది. "యదార్థా"న్ని అనుశీలన, పరిశీలనల ద్వారా గ్రహించమంటుంది. కళ్ళు మూసుకుని దేన్నయినా నమ్మడానికి నిరాకరించమంటుంది. బుద్ధిని, అనుభూతుల్నీ, అనుశీలనను మేళవించి యదార్థాన్ని ఆకళింపు జేసుకోవాలని ప్రేరేపిస్తుంది. అదొక పరిశీలనా పంథా కవాటాలను కళా హృదయం ముందు తెరచి మౌలిక సిద్ధాంత స్వరూపాన్ని పరిచయం చేస్తుంది. దీనికి మూలమంత్రాన్ని సూచిస్తుంది. తద్వారా జగతిలోని సత్యాలను, జీవితంలోని వాస్తవికతల్ని, మానవతా యదార్థాలను బాహ్యరూపాల ద్వారానే అంతర్ముఖమయి, జ్ఞాన జ్యోతితో శోధించమంటుంది. అలా జరిగినప్పుడు మానవ ఆంతర్యం రసజ్ఞతా వర్ణాలను స్వంతం చేసుకుంటుంది. అప్పుడు అటువంటి ఆత్మకు నిజవిశ్వ రూపం ఆవిష్కృతమవుతుంది.

ఆ రసజ్ఞతా జ్యోతితో హృదయం ఈ నిఖిల జగతినే దర్శించగలుగు తుంది. గతం, వర్తమానం, భవిష్యత్తు అంతా ఆ వెలుగులో ఒకే పంక్తిలోనిలిచి అవగాహనా సోపానాలను తెరచి ఆహ్వానిస్తాయి. చరిత్రను, సంస్కృతిని, నాగరికతను, దాని వాస్తవ రూపాలలో భిన్న కోణాలలో కానగలుగుతుంది

కళాహృదయం. అప్పుడు కళా సృజనకు అంకురార్పణ జరుగుతుంది. భావం, రూపం, శిల్పం, గమనం, శైలి- అన్నీ చేతులు కట్టుకుని నిలుస్తాయి- సేవించ డానికి సిద్ధంగా. అలా కళాసృష్టి ప్రభవన ప్రారంభ మవుతుంది- ఇస్లామీయ కళాకారుని మనుగడలో!

సృజనకు మూలస్థానమయిన మనోమయ జగత్తుకు ఇస్లామ్ కళా కొలమానాల నిస్తుంది. మంచీ చెడుల కొలమానం, సత్యాసత్యాల కొలమానం, న్యాయాన్యాయాల కొలమానం. లాభనష్టాల కొలమానం, ప్రేమ, ద్వేషాల కొలమానం, స్వీకార తిరస్కారాల, కొలమానం. అవి స్థిరమయిన, శాశ్వత మయిన కొలమానాలు, దేశ, కాల అవధులకు అతీతమయిన విశ్వజనీన మయిన కొలమానాలు; విశ్వసనీయమయిన కొలమానాలు. అది జీవితానికి దిశను నిర్దేశిస్తుంది. చరిత్రకు దారి చూపుతుంది; అది స్తబ్దతను ఏవగించు కుంటుంది, చలనాన్ని చేరదీస్తుంది; నిష్క్రియాపరత్వాన్ని నిరసిస్తుంది, క్రియా శీలతను ఉత్తేజపరుస్తుంది. ఆంతర్యాన్ని జీవన జ్వాలతో ప్రజ్వలింపజేస్తుంది. సంఘర్షణను ప్రేరేపిస్తుంది. సతత సమరానికి పురికొలుపుతుంది. మానవుని భౌతిక జీవనాధారాలయిన గాలి, నీరు, వెలుగులా ఆత్మవికాస మూలమయిన ఇస్లామ్ రసజ్ఞాతకు, కళలకు, సాహిత్యానికీ తనదంటూ స్థానముందనీ, దనదంటూ దారి ఉందనీ నిర్దిష్టపరచదా?

వాస్తవంగా ఇస్లామ్ మానవ జీవితాన్ని అందులోని సమస్తకోణాలను ఆవరించి, ఆవహించి తనలో అమర్చుకుంటుంది. కేవలం సైద్ధాంతిక మార్గ దర్శకత్వం, తాత్విక చింతనాపథం మటుకేకాక వ్యక్తిగత, సామూహిక, సామాజిక, ఆచరణాత్మక జీవితాన్ని, నైతిక కోణాలతోపాటు జీవితపు అంతర్ముఖ కోణాన్నీ, మనోమయ లోకాలను, ఆలోచనల్ని, భావనల్ని, ఉద్రేకాలను, ప్రవృత్తులను, సృజనాత్మక రూపాన్నీ, కళా పిపాసను- ఆంతర్యం

కోరే సమస్త పార్శ్వాలను జ్యోతిర్మయం చేస్తుంది. కళాస్రష్ట ఏ క్షేత్రంలో ఉన్నా- సాహిత్యం, శిల్పం, గానం, చిత్రం, కవనం ఏ రంగంలోనయినా సరే, ఏ ప్రక్రియను చేపట్టినా సరే- ఇస్లామ్ దిక్సూచిగా అతనికి దారిచూపెడుతుంది. దారిచూపి వెనుదిరగదు, ఇష్టమయిన రీతిలో కొండల్లో, కోనల్లో, డొంకల్లో, ముండ్ల బాటల్లో తచ్చాడమని వదలిపెట్టదు. అడుగడుగునా తోడయి నిలుస్తుంది. అనుభవాలను, అనుభూతుల్ని పంచుకుంటుంది, స్ఫురణలోను, సృజనలోను సహకారం అంద జేస్తుంది. ఇస్లామ్ మానవ జీవితంతో అనుక్షణం అండగా ఉంటుంది.

# పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం
## ప్రశ్నావళి సమాధానాలు

★ **రచనల్లో ప్రధానంగా మీరు చెప్పదలుచుకున్న అంశం ఏమిటి?**

☆ మానవుడు యాదృచ్ఛికంగా, కాకతాళీయంగా, అకస్మాత్తుగా జన్మఎత్తిన జీవికాడు. ఈ సృష్టి యావత్తుకు సృష్టికర్త, దైవం, ఓ పథకం ప్రకారం, తన సృజనాశక్తి, అధికారం, నిర్ణయం ప్రకారం సృష్టించిన మహత్తరమయిన సృష్టి. తన ప్రభువు, కర్త, స్వామి అయిన దైవాన్ని మరువకుండా ఆయనకే, ఆయన ఆదేశాలకే తల ఒగ్గి జీవించడమే మానవునికి సరయిన, సమంజసమయిన, సహేతుకమయిన విధానం. అదే అతని ప్రాపంచిక జీవితానికి సాఫల్య సోపానం; అదే అతని పారలౌకిక జీవితానికి విజయపథం.

★ **ముస్లిం రచనల్లో ఏ ప్రక్రియని రచయితలు / రచయిత్రులు ఆదరిస్తున్నారు? కవిత్వమా? కథా? నవలా? మరేదైనానా?**

☆ రచనలనేవి ముస్లిమ్ రచనలనీ హిందూ, క్రిష్టియన్ రచనలనీ ఉంటాయని నేను అంగీకరించను. ముస్లిమ్ అని పిలువబడే వ్యక్తి చేసినంత మాత్రాన ఓ రచనను ముస్లిమ్ రచనగా పేర్కొనడం భావ్యం కాదేమోనని నా ఉద్దేశ్యం. రచనలను విలువల ఆధారంగా విభజించ

వచ్చునేమో కాని మతం, కులం ప్రాతిపదికగా కాదు. పోతే, ముస్లిమ్ రచయితలు నేడు అత్యధికంగా కవిత్వ ప్రక్రియను ఆశ్రయించినట్లుగా గోచరిస్తుంది. కారణం, నేడు బాగా ప్రసిద్ధిచెందిన 'వచన కవిత' అతి సునాయాసమయిన ప్రక్రియగా అందరూ భావించడమే. అయినా అందలి మెలుకువలు అవగతపరచకున్న కవిత్వం బహు స్వల్పంగానే కానవస్తుంది. రెండవ స్థానం కథకు ప్రాప్తమయింది. మంచి కథకులయిన ముస్లిమ్ రచయితులున్నారని గట్టిగా నమ్ముతున్నాను. ఈ మధ్యనే 'సాహితీ విమర్శ'లోనూ, 'సాహితీ సమీక్ష'లోనూ కొందరు విమర్శకులూ సమీక్షకులూ దర్శనమిస్తున్నారు.

అంతేకాక, ఉర్దూభాష (ముస్లిములు ఆంధ్రప్రదేశ్‌లో సర్వసాధారణంగా వాడుకునే భాష) పైన పట్టుతగ్గడంతోనూ, తెలుగు ఆవశ్యకత, విద్యాభ్యాసం పెరగడంతోనూ ఈ మధ్యనే తెలుగు ధార్మిక రచనపట్ల కూడా ముస్లిములు మొగ్గుచూపుతున్నారు. ఈ రంగంలో చాలా అనువాదాలు వచ్చాయి. అయితే వాటి 'వాసి' కన్నా రాశే ఎక్కువేమో అని నా అనుమానం.

★ **ముస్లిం / ఇస్లాం అని రెండు వాదాలు వినిపిస్తున్నాయి. ఒక రచయితగా / రచయిత్రిగా ఈ రెండింటి ప్రధాన ఉద్దేశం ఏదని మీరు భావిస్తున్నారు?**

☆ నేను ఈ వాదాలను సుతరామూ అంగీకరించను. నా వాదనను ఈ పంక్తుల్లో వివరించడం కష్టం. ఈ విషయంలో నేను వ్రాసిన రెండు వ్యాసాలు చదువుకోగలరు. (సాహిత్యం, 'వాద' వివాదాలు వ్యాస పరంపర)

★ **ముస్లిం / ఇస్లాంవాద సాహిత్య ప్రతిఫలనం సమాజంలో కనిపిస్తు న్నదా? ఆయా మార్పులు సమాజంలో చోటుచేసుకున్నాయన్నది ఎంతవరకు వాస్తవం?**

☆ అంతా బూటకం.

★ **ముస్లిం వాదం / ముస్లిం మైనారిటీవాదం ఈ రెండింటిలో ఏది సరియైనదని మీరు అభిప్రాయపడుతున్నారు?**

☆ రెండూ తప్పుడు వాదాలే.

★ **ముస్లింల పరిస్థితి ఏ రకంగా ఉందని ఒక ముస్లింగా మీరు అనుకుంటున్నారు?**

☆ ఈ ప్రశ్నకు సమాధానం కొరకు నా కన్నా ఎన్నో రెట్లు సాధనా సామగ్రి ఉన్న 'సచర్ కమిటీ' నివేదికలో ముస్లిముల పరిస్థితిని గురించి దర్శించవచ్చు. 'గీటురాయి' వారపత్రికలో వచ్చిన సమీక్ష నా అభిప్రాయాలకు దాదాపు అద్దం పడుతోంది.

★ **అగ్రవర్ణాల్లో, దళితుల్లో, ముస్లింలలో ధనిక, పేద వర్గాలున్నాయి. ఏ రకమైన సమానత్వం కావాలని ఒక రచయితగా / వ్యక్తిగా మీ అభిప్రాయం?**

☆ నేను, మానవులందరూ ఒకే తల్లిదండ్రుల సంతానమని నమ్ముతాను. అందువల్ల అగ్రవర్ణాలనీ, అధమ వర్ణాలనీ, ధనికులనీ పేదలనీ తెలిపే తరతమ భేదభావాలను నేనంగీకరించను. అందరి మధ్య సామాజిక, సాంస్కృతిక సర్వసమానతను నేను కోరుకుంటాను. అదే విధంగా ఆర్థికంగానూ సమాన అవకాశాలు, న్యాయవంతమయిన సమానత్వమూ నెలకొనాలని కాంక్షిస్తాను.

★ **ముస్లిం జీవితాలు ఆనందకరంగా సాగాలంటే ఏ రకమైన మార్పుని మీరు ఆశిస్తున్నారు?**

☆ 1. ముస్లిములు తాము జీవిస్తున్న పరిస్థితుల సరయిన, సమగ్రమయిన, సమంజసమయిన అవగాహన కలిగి ఉండాలి.

2. తాము కేవలం ఒక 'మతవర్గం'గా కాక ఒక నిర్మాణాత్మక సందేశం గల, ఒక సంస్కరణాత్మక బాధ్యతగల సుసంఘటిత సముదాయంగా, బాధ్యతాయుత సముదాయంగా జీవించడం నేర్చుకోవాలి.

3. దీనిగ్గాను వారు ధార్మిక జ్ఞాన సముపార్జనతోపాటు సకల సమకాలీన శాస్త్రాలలో కూడా సమంగా, తోటి సోదర దేశవాసులకు ఏ విధంగానూ తీసిపోకుండా, ప్రావీణ్యం సంపాదించాలి.

4. తమ మనుగడకు అడుగడుగునా ఎదురవుతున్న పోటీ వ్యవస్థను ఎదుర్కొని నిలకడ చూపడమే కాక వీలయినంతమేర ముందడుగు వేసే స్తోమతను గడించాలి.

5. తమ హక్కుల కొరకు పోరాడటం బలహీనుల తత్వం. తమలోని కొరతలను, లోటుపాట్లను స్వయంకృషి ద్వారా అధిగమించి హక్కులకు వంచితులయిన ఇతర పీడిత తాడిత జనావళి కొరకు, వారి సముద్ధరణ, సంస్కరణల కొరకు ముమ్ముందే ఉంటూ జన సేవా రంగంలో, తమ సాముదాయిక బాధ్యతా నిర్వహణా రంగంలో పురోగమిస్తూనే ఉండాలి. 'పుచ్చుకునే' వారుగా కాక 'ఇచ్చే' వారుగా రూపాంతరం చెందేందుకు శాయశక్తులా కృషి జరపాలి.

6. తామున్న పరిస్థితుల్లో అలుపెరుగని యోధుల్లా, వ్యక్తిగత జీవితంలోనూ, సామూహిక జీవితంలోనూ శ్రమపడేందుకు అలవాటు పడాలి.

7. తమ సముదాయాన్ని ఒక శ్రేయస్కర సమాజంగా, మంచిని పెంచే, చెడును అడ్డుకునే సమాజంగా రూపొందించేందుకు అహర్నిశలు కష్టపాడాలి. ఈ మార్పులే వారి భవిత్యవానికి సరయిన సోపానాలు.

★ **ముస్లిం మైనారిటీ సమస్యలను ముస్లిం రచయితలే ప్రభావపూరితంగా వ్యక్తీకరించగలరు అన్న ఆలోచనకు మీ సమాధానం?**

☆ నేనంగీకరించను. సామాజిక అవగాహనగల, చిత్తశుద్ధితో ఏ సమస్యనయినా అన్ని కోణాలలోనూ చూడగల న్యాయశీలుడయిన ఏ రచయిత అయినా ఎవరి సమస్యలనయినా సరే ప్రభావపూరితంగానే వ్యక్తీకరించగలడు. 'సచర్ కమిటీ'లోని వారంతా ముస్లిములుకారు.

★ **తెలుగులో వస్తున్న ముస్లిం మైనారిటీ సాహితయ నాణ్యత (quality), పరిమాణం (quantity) గురించి మీ ప్రతిస్పందనని తెలియజేయండి?**

☆ ముస్లిములు చేస్తున్న సాహితీ కృషి పరిమాణం రీత్యా కొండంతగా కనిపించినా అది నాణ్యత దృష్ట్యా దూదికొండలాంటిదా అనిపిస్తుంది. గాఢత, బరువు, లోతు లోపించాయని అనుకోవలసి వస్తుంది. బహుకొద్దిగా అధ్యయనం చేసి సువిస్తరంగా రచనలు చేస్తే ఇలాగే ఉంటుందేమో! అయితే కృషి మొత్తాన్నీ ఇలా 'తుల'నాడటం బహుశా న్యాయం కాదేమో కూడా. రాశిలో మెండుగా ఉన్న కవితల కుప్పలకే వర్తిస్తుంది నా యీ కామెంటు.

★ **ముస్లిం మైనారిటీ సాహిత్యం భవిష్యత్తుల ఆవిష్కరించవలసిన నూతన కోణాలను తెలియజేయండి?**

☆ మౌలికంగా ఈ ప్రశ్న నాకు వర్తించదు. ముస్లిములు సాహితీవేత్తలయినట్లయితే తమ వ్యక్తిగత సాముదాయిక బాధ్యతలననుసరించి

సమాజంలోని బాధితు లందరి సమస్యలను, పీడితులందరి గాథలను, అణచివేయబడిన వారందరి హక్కుల పోరాటాలను తమ రచనల్లో ప్రతి ఫలింపజేయవలసి ఉంటుంది. కేవలం సమస్యలను ప్రతిఫలించడం మాత్రమే కాక వాటికి సరయిన పరిష్కా రాలనూ సూచించడం కూడా రచయితల బాధ్యతే అని నా నమ్మకం.

★ **ముస్లిం రచనల్లో మతానికి, సంస్కృతికి సంబంధించిన ఎన్నో ఉర్దూ మాటలను వాడుతున్నారు. వాటికి రచనల్లో వివరణ ఇవ్వక పోతే ఎంతవరకు ప్రయోజనం నెరవేరుతుంది?**

☆ ఇది అలా చేసేవారిని అడగవలసిన ప్రశ్న. రచన, వ్రాత ఏదయినా చదువరులకు తన అభిప్రాయాన్ని వ్యక్తం చేసే సాధనం. అది ఎదుటివానికి బోధపడే భాష, పదబంధాలు, పదనివేశాలలో ఉండటం అవసరం అని నేను అభిప్రాయపడు తున్నాను. తెలుగు చదువరులకు తెలుగులోనూ, ఉర్దూ పాఠకులకు ఉర్దూలోనూ వ్రాయడమే సంస్కార వంతుల లక్షణం.

★ **ముస్లిమేతరులు తమ రచనల్లో ప్రస్తావిస్తున్న ముస్లిం మైనారిటీ విషయాల పట్ల మీ ప్రతిస్పందన?**

☆ నాకు తెలిసినంతవరకు చాలా తక్కువ మంది లోగడ ముస్లిముల విషయాలు తమ రచనల్లో ప్రస్తావించారు. ఇప్పుడూ అంతే. అందువల్ల ఏమీ చెప్పే స్థితిలో లేను. కేవలం కొన్ని ముస్లిం పాత్రల చిత్రణను (అదీ చాలావరకు హేయంగా) ముస్లీముల విషయాల 'ప్రస్తావన'గా కూడా నేను గుర్తింపునివ్వడానికి సిద్ధంగా లేను.

★ **దక్షిణ ద్రావిడ భాషల్లో ముస్లిం మైనారిటీ సాహిత్యం బాగా వెలువడు తున్న భాష గురించి కొంత వివరణ ఇవ్వండి?**

☆ సాహితీ కృషి అన్నది భాషా పరిజ్ఞానాన్నిబట్టి ఉంటుంది. తెలుగునాట ముస్లిముల్లో విద్యాభ్యాసం ఇప్పుడిప్పుడే ఊపందుకుంటున్నది. కాని మలయాళం, తమిళ భాషల్లో ముస్లిములు చేసిన సాహితీ కృషివల్ల వారి ఆయా భాషల రచనలు (పద్యమయినా, గద్యమయినా) అంతర్జాతీయ స్థాయిలో గుర్తింపు పొందాయన్నది వాస్తవం.

★ **ముస్లిం రచయితల్లో మహిళా రచయిత్రుల స్థానాన్ని (status) గురించి చెప్పండి?**

☆ తెలుగు ముస్లిమ్ రచయిత్రుల స్థానం ఇంకా ఖాళీగానే ఉందని నా భావన. అంటే పురుషులను పోల్చినట్లయితే మహిళలు ఇంకా వెనుకబడే ఉన్నారన్నది సత్యం. అయితే అంకురార్పణ జరిగింది, ఇప్పుడిప్పుడే పాదుకుంటోంది గనక మున్ముందు బాగా ప్రాకిపోయే అవకాశం లేకపోలేదు.

★ **ముస్లిం మైనారిటీ రచయిత్రులు తమ రచనల్లో ప్రస్తావించిన స్త్రీల సమస్య లను, మహిళల సామాజిక స్థితిగతుల్ని ప్రస్తావించండి?**

☆ చెప్పానుకదా, అవి ఇంకా సరయిన చోటును ఆక్రమించుకోలేదనే నేను భావిస్తున్నాను. వచ్చిన కొద్దిపాటి రచనల్లోనూ నిజస్థానాన్ని ప్రతిబింబించేవి చాలా తక్కువ. ఊహాజనితమయినవి, మరీ వెనుకబడిన వర్గాలలోని (దేశంలోని ఇతర వర్గాల ప్రజలకు మాదిరిగానే) కొన్ని స్వల్పమయిన అంశాలను భూతద్దం పట్టి చూపించిన ఉదంతాలు కొన్ని ఉన్నా, అవి అప్రధానమయినవి.

★ **స్త్రీవాద / దళితవాద / ముస్లిం మైనారిటీవాద సాహిత్యాలు సమాజాన్ని, వ్యక్తులని విడదీస్తున్నాయి. సామాజిక సమైక్యతను**

**దెబ్బతీస్తున్నాయి అన్న ఆలోచనపట్ల మీ ప్రతిస్పందన ఏమిటి?**

☆ ఇది పదహారణాలా వాస్తవం. సాహిత్యం, నా దృష్టిలో మనుషుల్ని- వారెవ రయినా- ఏకం చేయడానికి, పరస్పర సానుభూతికి పాత్రులవడానికి అవసర మయిన సృజించేందుకు కృషి చేయాలి. ఈ వాదాలు మనుషుల మధ్య - వారెవరయినా సరే- విద్వేషాన్ని, వేర్పాటును సృజిస్తాయే తప్ప ప్రేమైక వాతా వరణాన్ని కాదు. సమాజాన్ని విచ్ఛిన్నం చేసేది, అది ఏ వాదమయినా సాహిత్యం మటుకు కాదని నేను అభిప్రాయపడుతున్నాను. ఈ వాదాల వల్ల సాహితీ ప్రయోజనాలు నెరవేరవు, సామాజిక ప్రయోజనాలూ నెరవేరవన్నది నా అభిప్రాయం.

★ **ఇస్లాంవాదం అనేక మతాల సమ్మేళనమైన భారతదేశంలో వేర్పాటు ధోరణిని ప్రోత్సహిస్తున్నది అంటే మీరేమంటారు?**

☆ ఇస్లామ్ అన్నది ఒక సైద్ధాంతిక జీవనవిధానం. ఇస్లామ్‌ను ప్రతిబింబించే సాహిత్యం- అది నిజంగా ఇస్లామ్‌ను ప్రతిబింబిస్తే- వేర్పాటు ధోరణిని కాదు, సమైక్యతా భావాలను పెంపొందిస్తుంది. కాని 'ఇస్లాంవాదం' అన్న పేరుతో వస్తున్న సాహిత్యానికీ 'ముస్లింవాదం' అన్న పేరుతో వస్తున్న సాహిత్యానికీ మౌలికంగా ఎటువంటి వ్యత్యాసం నాకు కానరాలేదు. 'ఇస్లాంవాద' కవిత్వం ఇస్లామ్‌ను ప్రతిఫలిస్తోందని నేను అనుకోవడం లేదు. ఇస్లామ్‌వాదం పేరుతో వస్తున్న సాహిత్యం నకారాత్మకంగా ఇస్లామ్ పట్ల పేరుకుపోయిన అపోహల్ని దూరం చేయడానికని అంటున్నారు. అందులోనూ ఇస్లామీయ సంప్రదాయాల కనుగుణంగా ప్రగతి సాధించారని నేను అనుకోవడం లేదు. ఇస్లామ్ అన్నది సాధారణ పారిభాషిక భావంలో 'మతం' కాదు. అదొక

జీవనవిధానం. అందులోని ప్రధానమయిన ప్రాతిపదికలు సర్వజనీన మయినవి, సర్వకాలిక మయినవి. వాటివల్ల వేర్పాటు ఏర్పడరాదు. అవి:

1) ఈ విశ్వాన్నీ- పుడిమినీ, పుడిమిలో నివసించే సకల జీవరాశినీ, మానవుడి వంటి 'నేర్పరి'తో సహా మొత్తం జగతిని - సృష్టించిన వాడు ఒకే స్వామి, ప్రభువు; సర్వమూ, సర్వులూ ఆయనకు దాసులే.

2) మానవులంతా ఒకే తల్లిదండ్రుల సంతానం కనుక వారి మధ్య భేదభావాలు తారతమ్యాలు ఉండటానికి ఆస్కారం లేదు.

3) దేవుడు ఒక్కడే, దేవుని సృష్టిరాశి అయిన మానవులూ, అంతా ఒక్కటే అయినప్పుడు మానవునికీ, దేవునికీ మధ్య సంబంధాన్ని ఏర్పరిచే ధర్మమూ (Religion) కూడా ఒక్కటే కాగలదు. అదే దైవవిధేయతా ధర్మం.

4) మానవాళికి దేవుని అభీష్టం, దైవవిధేయతా ధర్మాన్ని తెలిపే మార్గం అన్ని దేశాల్లోనూ, అన్ని కాలాల్లోనూ సదా ఒక్కటే. అదే దైవసందేశ హరులు, లేక దైవదూతలు అందజేసిన ధర్మం.

ఈ ధార్మిక ప్రాతిపదిక వల్ల వేర్పాటు ధోరణి ప్రోత్సాహం పొందు తుందా, సమైక్యతా భావమా?

★ **అంతర్జాతీయంగా వస్తున్న ముస్లిం / ఇస్లాం సాహిత్యంతో మీకు పరిచయం ఉందా? ఉంటే వివరాలు తెలియజేయండి?**

☆ అంతర్జాతీయ స్థాయిలో అందరిలానే ముస్లిములు అనేకమంది సాహితీ కృషిలో పాల్గొంటున్నారు. వారిలో చాలామటుకు స్థానిక సామాన్య సమస్యలను, స్థానిక ముస్లిముల సమస్యలను ప్రతిఫలించే రచనలు

చేసేవారే అధికం. ఇస్లామీయ దృక్పథంతోనూ సంస్కరణాత్మక సాహిత్యమూ ఈ మధ్యవిరివిగా వస్తోంది. ముఖ్యంగా అరబీ, ఉర్దూ భాషల్లో. ఇంగ్లీషులోనూ వస్తున్న సాహిత్యం అత్యధికంగా సృజనాత్మక మయిందికాక, బోధనాత్మకమయినదే అధికమనవలసి ఉంటుంది. టర్కీ, ఫార్సీ భాషల్లోనూ సృజనాత్మక రచనలు జరుగుతున్నట్లు ఉర్దూ వ్యాసాల ద్వారా ద్యోతకమవుతోంది. అనువాదాలు వచ్చినప్పుడు చూసే అవకాశం కలుగుతుంది. నేరుగా, విరివిగా తెలుసుకునే అవకాశాలు బహుస్వల్పం. ఒకటి మాత్రం వాస్తవం, ప్రపంచంలో ఇస్లామ్ పట్ల జరుగుతున్న అపోహల ప్రచారం కారణంగానూ, ముస్లిముల పైన అప్పుడప్పుడు జరుగుతున్న అవమానాల ప్రయోగాలవల్లనూ ముస్లిమ్ రచయితల్లో, మరీ ముఖ్యంగా ఇస్లామీయ దృక్పథమున్న రచయిత / రచయిత్రుల్లో ఓ అవగాహన స్పృహ, చేతన దృఢమయింది. వారు చిత్తశుద్ధితో ఇస్లామీయ ప్రమాణాలను, మూల్యా లను తమ సృజనాత్మక రచనల ద్వారా వ్యక్తీకరించే కృషి జరుపుతున్నారన్నది మటుకు నిజం.

★ **భారతదేశంలో మహ్మదీయుల పరిస్థితిపట్ల మీ అభిప్రాయాన్ని తెలియజేయండి?**

☆ నేను ప్రథమంగా మీరు ప్రయోగించిన 'మహ్మదీయులు' అన్న పరిభాషపట్ల నిరసన తెలుపదలిచాను. క్రైస్తవులు (ఏసుక్రీస్తును దైవంగా తలచడంచేత) తమను తాము క్రైస్తవులుగా భావించినట్లే ముస్లిములను అలాంటి వక్రభావంలోకి ఈడ్వడానికీ, ముస్లిములు సయితం ముహమ్మద్ ప్రవక్తను దైవంగా భావిస్తారన్న అపార్థం సృష్టించడానికీ ఆ పదాన్ని Coin చేశారు పాశ్చాత్యులు. ఇది ఎంత మాత్రం ముస్లిము

లకు రుచించని అంశం. దయచేసి ముస్లిములను 'ముస్లిములు" గానే ఉండనివ్వండి.

ముస్లిములు భారతీయులు. భారతదేశంలోని సామాన్య ప్రజలకున్న సమస్యలన్నీ వారికీ ఉన్నాయి. బీదరికం, నిరక్షరాస్యత, నిరుద్యోగం, కొన్ని వర్గాలపట్ల వివక్ష, స్త్రీల పట్ల నిరాదరణ, స్త్రీలమాన మర్యాదలకు రక్షణ రాహిత్యం - ఇవన్నీ ఈ దేశంలోని ప్రజలదరికీ ఉన్న సమస్యలే. కాకపోతే అనేక చారిత్రక కారణాలవల్ల, బ్రిటిష్ పాలకులు, భారత దేశంలోని హిందూ ఉగ్రవాద ప్రచారకులు చేసిన దుష్ప్రచారాల వల్ల ఆత్మన్యూనతా భావానికి, వ్యక్తిగత స్థాయిలోనూ సాము దాయికంగానూ లోనయి ఉన్న ముస్లిముల విషయంలో ఈ సమస్యలు మరీ ఉధృతంగా, తీవ్రంగా, విస్తారంగా, అధికంగా ఉన్నాయి, అధికం గానే గోచరిస్తాయి కూడా. ఇప్పుడిప్పుడే ముస్లిములు వీటి నుండి బయట పడే కృషి చేస్తున్నారు. ఇది బహుశా సంధికాలం కావచ్చు.

★ **భారతదేశంలో మహ్మదీయుల అభివృద్ధికి, సంక్షేమానికి మీరు ప్రత్యేకంగా చేసే సూచనలు ఏమిటి?**

☆ ముందు ముస్లిములు తాము లోనయివున్న ఆత్మన్యూనతా భావపు ఊబి నుండి బయటపడాలి. తమకు ఎదురవుతున్న వివక్షను కక్ష భావనతోకాక ఆత్మగౌరవ భావనతో అధిగమించే ప్రయత్నాలు చేయాలి. స్వయంకృషి, నేటి పోటీ ప్రపంచంలో అవసరమయిన ఇతోధిక శ్రమ, అవిరళ కృషి ద్వారానే తాము ఈ ప్రతికూల వాతా వరణంలో నిలదొక్కకోవడం సాధ్యమన్న సత్యాన్ని గుర్తించి స్వీయ నిర్మాణ పథాన్ని ఏర్పరచుకోవాలి. ముస్లిములు తాము కూడా ఈ దేశంలోని అనేక కులాలలో, ఒక కులం కాదని, తాము ఓ అంతర్జాతీయ

సైద్ధాంతిక సముదాయమని అతి త్వరగా గ్రహించాలి. తదనుగుణంగా తమ కార్యాచరణను నిర్మించుకోవాలి. (1) ప్రప్రథమంగా విద్యకున్న ప్రాముఖ్యాన్ని గుర్తించిన దైవప్రవక్త అనుయాయులుగా తమ విద్యావసరాల పరిపూర్తికి తగిన ఏర్పాట్లు చేసుకోవాలి. సముదాయంలో ఎవ్వరూ నిరక్షరాస్యులుగా ఉండరాదన్న లక్ష్యాన్ని వీలయినంత త్వరగా సాధించేందుకు కృషి చేయాలి. (2) తమకున్న పరిమిత ఆర్థిక ఒనరుల్ని పొదుపుగా వాడుకుని తమలోని ఉపేక్షిత జనుల సముద్ధరణను, స్వయం సమృద్ధి సూత్రం ప్రధానంగా సాధించేందుకు పూను కోవాలి. (3) తమ వృద్ధివికాసాలకు ఎవరో వచ్చి ఏదో చేస్తారని ఆశించకుండా (కడకు ప్రభుత్వ వ్యవస్థపైనా ఆధారపడకుండా) తాము స్వయంగా చేయ గలిగిందేమిటో చేసే మనస్తత్వాన్ని ఏర్పరచుకోవాలి. (4) దేశంలో తమకున్న స్థాయిని, స్థానాన్ని, హక్కుల్ని సక్రమమయిన రీతిలో, ప్రజాస్వామిక పంథాలో సాధించేందుకు నిరంతర కృషి సలపాలి. (5) తాము ఒక ధార్మిక సముదాయంగా, ఆధ్యాత్మిక సమాజంగా కేవలం తమ వరకే కాక తమ ప్రయత్నాల ఫలాలు తోటి ఉపేక్షిత సోదరులకు కూడా ప్రాప్తమయ్యేలా సానుభూతితో, ప్రేమతో ప్రయత్నిం చాలి. నా దృష్టిలో ఇదే వారి అభివృద్ధికీ సంక్షేమానికీ రాచబాట.